

చేపలకోసం కలలు

—ఫొటో: సి. సీతారాం, మద్రాసు.

సంవత్సర చందా
రు. 12_0_0
విడిప్రతిక 4 అ.

# ఆంధ్రపత్రిక

సచిత్రవారపత్రిక

Founder : K. NAGESWARA RAO

సంపుటము 48
సంచిక 7
13-10-54

జయ ఆశ్వయుజ బహుళ పాడ్యమి బుధవారం

పండిన పంటకు పరమానందం

—ఫొటో : పి. వీరన్న, విజయవాడ.



# కాలక్షేపం

ఉరుగతి తోడనేసు
  దడవుండియు భోగముః లట్టివాని దా
నరుడు పరిత్యజింపడు;
  కనంగన దద్విరహంబు ఖిన్న మే?
పురుషుని భోగముల్ విడిచి
  భూరి మనోవ్యథ లాచరించుః – నా
పురుషుడె భోగముల్ విడిచి
  పొందు నిరామయ శాంతి సౌఖ్య
ముల్.

తా॥ భోగములనేవి కొంత కాలము ఉండి వేగముగా వెడలిపోవును. అయినప్పటికీ అటువంటివానిని మానవుడు పరిత్యజింపడు. చూడగా జూడగా వానికొరకై పడెడి విరహము అనునది ఒక విధమైన బాధగాక అందుకు అభిన్నమైనదా? భోగములనునవి మానవుని విడిచిపెట్టి పోయినప్పుడు, మనస్సుకు గొప్ప బాధను కలిగించును. కాని, ఆ మానవుడే తనంతట తాను ఆ భోగములను విడిచిపెట్టిన వాడైనచో, వ్యాధి బాధలు లేకుండా శాంతిని సౌఖ్యమును పొందగలడు.

అవు పాడి ఎన్నాళ్లు? అయిశ్వర్యమెన్నాళ్లు? పాలు యిచ్చే ఆవుకూడా ఒక్కొక్క రోజున పాలు పితుకనివ్వదు. పాలు పితుకుటకు వచ్చినవానిని తన్నుతుంది. ఒక్కొక్క రోజున పాలు చేపదు. పాలు పితికినప్పుడు ఎవరైనా చూస్తే దృష్టిదోషం తగులవచ్చు. మరొక్క రోజున పాలన్నీ దూడ కుడుచుకొని పోవచ్చు – ఒక యేడాది పాలు ఇచ్చిన తర్వాత పాలు ఎండి పోవచ్చు. అటువంటి కష్టనష్టములు ఆవు విషయంలో అనేకం ఉన్నాయి. కాని, అంతమాత్రముచేత ఆవును విడిచిపెట్టి, ఆవు లేనివానిపని హాయి అనడం పురుషపుంగవుడైన సంసారికి సవ్యమా? భావ్యమా? శ్రేయస్కరమా? శోభస్కరమా? ఇహానికి సాణ్యమా? పరానికి పుణ్యమా? అప్పుడు ప్రసవించుచున్న ఆవు చుట్టూ ప్రదక్షిణంచేస్తే భూప్రదక్షిణం చేసినంత ఫలితం ఉంది. కాలధర్మము నందిన తండ్రియొక్క ఆత్మ వైతరణి దాటి తరించవలెనంటే, ఒక గోవును దానంచేస్తే చాలునన్నారు. పితృదేవతలను పుణ్యలోకానికి చేర్చగలదన్నారు. కాశీలో గోదానంచేస్తే అటు ఏడుతరాలూ ఇటు ఏడుతరాలూ తండ్రివైపునవూ, తల్లివైపునవు కూడా తరిస్తారన్నారు. అటువంటి పితృలోకాలు ఉన్నప్పటికీ లేకపోయినప్పటికీ, [illegible]ంలో అటువంటి పవిత్రభావాల[illegible]వల్లనే మనము తరిస్తాము. గోవులను [illegible] సరిగ్గా పాలిస్తే అవి మనకు సరిగ్గా పాలిస్తాయి.

యాజ్ఞవల్క్య మహర్షిఅంటే మహాజ్ఞాని. బృహదారణ్యకోపనిషత్తు చదివి చూస్తే ఆయన ఎటువంటి ఆత్మసంస్కారం కలవాడో బోధపడుతుంది. అర్జునుని కుమారుడు అభిమన్యుడు – అభిమన్యుని కుమారుడు పరీక్షిత్తు – పరీక్షిత్తుయొక్క కుమారుడు జనమేజయుడు. అతని తర్వాత మరికొందరు కౌరవవంశరాజులు పరిపాలించారు. ఈ జనమేజయుని తర్వాత వచ్చిన కొందరు రాజుల వరుసలో జనకమహారాజు పేరు కన్పిస్తోంది. అందువల్ల యీతడు క్రీస్తు పుట్టుటకు పూర్వము 7 వ శతాబ్దమునాటివాడని సుప్రసిద్ధ చరిత్రకారులగు హెచ్. సి. రాయిచౌదరిగారు నిర్ణయించారు. ఈ జనక మహారాజు కాలము నాటే యాజ్ఞవల్క్య మహర్షి అనే మహాజ్ఞాని ఉండేవాడనిన్నీ యీ మహర్షియొక్క జ్ఞానామృతసారమే బృహదారణ్యక ఉపనిషత్తు అనే పేరుతో మనకు లభించినదనిన్నీ నిర్ణయించారు. కనుక యిప్పటికి రమారమి 2,700 సంవత్సరాల నాటి గ్రంథం యీ బృహదారణ్యకోపనిషత్తు. ఇప్పటికి 2,700 సంవత్సరాల నాటివాడు ఆ జనకమహారాజు. జనకమహారాజు సభలో గొప్ప గొప్ప వేదాంత వేత్తలు ఉండేవారు. ఈ వేదాంతులతో ఆమహారాజు అఖండమైన ఆత్మవిచారణ చేసేవాడు. యాజ్ఞవల్క్య మహర్షియొక్క అద్భుతమైన ఆత్మజ్ఞానమునకు ఆ మహారాజు ఆత్మార్పణం చేశాడు. బంగారు రేకుతో కొమ్ములు చక్కగా అలంకరింపబడిన వేయి గోవులను ఆ మహర్షికి దానం చేశాడు. యాజ్ఞవల్క్యుడు బ్రహ్మజ్ఞాని. ఆ గోవులను తాను స్వీకరించి నిండుసభలో తన ఆత్మవిచారణా సారాంశములను సహేతుకంగా వివరించి బ్రహ్మజ్ఞానమనగా ఎటువంటిదో ఆత్మజ్ఞానమనగా ఎటువంటిదో నిరూపించియున్నాడు. బృహదారణ్యకోపనిషత్తులో యీ తత్వవిచారణ అంతా ఉంది. హస్తినాపురమును విలినటువంటిన్నీ, కౌరవ వంశమునకు చెందినటువంటిన్నీ క్రీస్తు పుట్టుటకు పూర్వము రమారమి 700 సంవత్సరములనాటి వాడున్నూ అయిన జనకమహారాజు యితడు.

విదేహ రాజ్యమునకు అధిపతియైన జనకమహారాజు మరొకడు ఉండేవాడు. ఇతడు క్రీస్తు పుట్టుటకు పూర్వము

## విషయానుక్రమణిక

ముఖచిత్రం: వైజయంతిమాల.



గతవారం (దసరా) సంచిక ముఖచిత్రం పంపినవారు ఎన్. సీతారామయ్య, నాగాయలంక.

రమారమి 1200 సంవత్సరములనాటి వాడని హెచ్. సి. రాయి చౌదరీగారు నిర్ణయించారు. అనగా, యిప్పటికి 3,200 సంవత్సరములనాటి జనకమహారాజు యితడు. అనగా రామాయణ కాలంనాటి జనకుడు యితడనిన్నీ, కౌరవ వంశములో జనమేజయునకు తర్వాత రాజ్యమునకు వచ్చిన జనకుడు ఇంకొకడనిన్నీ — మొత్తముమీద యిద్దరు జనకమహారాజులు కన్పిస్తున్నారనిన్నీ భావించవలసి వస్తోంది. భారతయుద్ధానంతర కాలమందు రాజ్యముచేసిన జనకమహారాజు కాలములోనే యాజ్ఞవల్క్యుడుఉండేవాడనిన్నీ, ఇతడే జనకునివద్దనుంచి గోవులను స్వీకరించి నటువంటి ఆత్మజ్ఞానియనిన్నీ, రాయిచౌదరీ గారు వాదిస్తున్నారు.

ఈ యాజ్ఞవల్క్యమహర్షి తన జ్ఞాన పటిమచేత జనకుని సభలో ఉద్దాలకుడనే ఉద్దండుడగు తత్వవేత్త వాదించి యున్నాడు. ఉద్దాలకునితో యాజ్ఞవల్క్యునకు వాగితర్కము జరిగిన నాటికి, జనమేజయుడు కూడా స్వర్గస్థుడైనాడడని బృహదారణ్యకోపనిషత్తువల్లనే తెలియుచున్నది. జనమేజయునకు భారతమును వినిపించినటువంటి వైశంపాయనుడు వ్యాసమహర్షియొక్క శిష్యుడు. ఈ వైశంపాయనుని శిష్యుడే యాజ్ఞవల్క్యుడని నిరూపింపబడినది.

ఏమైనప్పటికీ, మహాజ్ఞానియైన యాజ్ఞవల్క్యమహర్షి యొక్క బోధామృతము బృహదారణ్యకోపనిషత్తు నిండా ఉంది. మనము ఏ ధర్మమార్గమును నిర్ణయించి సిద్ధాంతీకరించినప్పటికీ, అట్టి ధర్మము మన ఆత్మ పరిపక్వమునకు సాధనభూతం కావాలన్నాడు. బిచ్చగానికి పిడికెడు బియ్యము భిక్షవేసినప్పటికీ, బిడ్డకు తల్లి పాలుయిచ్చినప్పటికీ, ఆత్మవికాసం కొరకేగాని మరొక ప్రాణిని ఉద్ధరించుటకొరకు కాదన్నాడు. మనలో దయారసం వృద్ధికావాలి గనుక దయగా ఉండాలి. తనలో మాతృవాత్సల్యము వృద్ధిపొందవలెను గనుక, తన బిడ్డకు తాను పాలుయిచ్చి తీరాలి. బిచ్చము వేయుట బిచ్చగానిని ఉద్ధరించడంకోసం కాదు. బిడ్డకు పాలివ్వడం బిడ్డను రక్షించడంకోసం కాదు. నీ ఆత్మవికాసానికి విరుద్ధమైనదేదో అది అధర్మం. నీ ఆత్మవికాసానికి అనుగుణమైనదేదో అది ధర్మం అని వాదించారు. ధర్మాధర్మ నిర్ణయం చేయుటకొక ధర్మసూత్రమును చూపించినవాడు యాజ్ఞవల్క్య మహర్షి. "అయ్యా! బీరకాయ తినవచ్చునా? దోసకాయ తినవచ్చునా?" అని ఒక్కొక్క శాకము విషయములో ఒక్కొక్క శంక కలుగవలసిన అవసరం లేదు. ఏది నీకు సులభసాధ్యంగా పక్వమై జీర్ణమై పుష్టి నివ్వగలదో, అదే పథ్యం — నీకు సులభంగా పక్వంగాక, జీర్ణంగాక, పుష్టినివ్వక నోటికి ఎంత ఇంపయినప్పటికీ అది అపథ్యమే — ఏదైనప్పటికీ నీ

## ★ కాలక్షేపం ★

జీర్ణశక్తినిబట్టి, నీ ఆత్మవికాసావసరమును బట్టి, ఏది హితమైనదో అదే ధర్మం. అదే ఆత్మవికాసమార్గం. అదే ఆత్మవిమోచన మార్గం అన్నాడు. నీ ముక్తికి నీకు ఏది హితకరమో అది నిర్ణయించుకో - లోకం సంగతి కాదు నీవు ఆలోచించవలసింది - నిన్ను నీవు ఉద్ధరించుకో - లోకాన్ని కాదు నీవు ఉద్ధరించవలసింది. ఇంతకుమించిన ఆత్మచింత లేదు. ఒక్క మాటలో చెప్పవలెనంటే తన్ను మాలిన ధర్మమూ లేదు. మొదలు చెడిన బేరమూ లేదు.

యాజ్ఞవల్క్యమహర్షి యిటువంటి మహాజ్ఞాని - అయితే నేమి? తనకు జనకమహారాజు బహుమానంగా యిచ్చిన వేయి ఆవులను చూచి "ఇవి నాకు అక్కరలేదు. ఎందుకు నాకీ పశుసంపద!" అన్నాడా? లేదు. నిరభ్యంతరంగా స్వీకరించాడు. ఆ కాలంలో పశువులను యివ్వడం అంటే బంగారం యిచ్చినట్లుగా భావించేవారు. "పశు" శబ్దంలో నుంచి ఏర్పడిన పదమే లాటిన్ భాషలోని "*Pecus*"(పికస్) అనే మాట. "పికస్" అంటే నేడు మనకు పైకం అయింది. దీనిలోనుంచి ఏర్పడినదే ఇంగ్లీషులోని "*Pecuniary*" "పిక్యూనియరీ" అనే శబ్దం. "పిక్యూనియరీ" "అంటే ఆర్థిక సంబంధమైన" అని అర్థం. "పశు" అంటే "పైసా" గా భావించింది లోకం. ఈ రోజులలో కూడా విశాఖపట్నం జిల్లాలో "పశువు" లకు "సొమ్ములు" అనే పర్యాయపదం ఉపయోగిస్తారు. ఈవిధంగా ఆనాటి కాలములో పశుసంపదనే అసలైన అయిశ్వర్యంగా భావించి, వెండి బంగారాలు యిచ్చి సన్మానం చేయుటకు బదులుగా బలిష్ఠమైన ఆవులనిచ్చి సన్మానించేవారు. మహాజ్ఞానియైన యాజ్ఞవల్క్యుడు "నాకెందుకీ పశుసంపద?" యని పశువును వాపసు చేయలేదు. "మహాప్రసాదం!" అని స్వీకరించాడు. ఆ సంపదను సద్వినియోగం చేసి ఉంటాడు ఆ మహాయోగి.

గాంధిమహాత్మునకు ఎంత డబ్బు యిచ్చినా చాలదనేవాడు. కోటిరూపాయిలు ఆరుమాసాలలో వసూలు చేశాడు. 1933 సం॥ లో ఒక పర్యాయము గాంధిమహాత్ముడు హరిజన నిధికోసం ఆంధ్రదేశంలో పర్యటన చేసినప్పుడు నెల్లూరు జిల్లాలో ఒక సంపన్న గృహస్థుని యింటికి వెళ్లడం తటస్థించింది. ఆ యింటిలోని ఒక ముసలి అవ్వను చూచి చమత్కారంగా మహాత్ముడు, "అమ్మా! నన్ను పెంచుకోన రాదా?" అని ప్రశ్నించాడు. ఆమె ఆమాటకు ఎదురు జవాబుగా "అందుకు ఆక్షేపణ ఏమీ లేదు గాంధీజీ!" అన్నది. గాంధిమహాత్ముడు అంతటితో ఊరుకోనక "నా కడుపు చాలా పెద్దది. నేను కేవలము అన్నము తినేవాడను కాను. బంగారమూ, నగలూ భక్షించి జీర్ణముచేసికొనేవాణ్ని, నాకు అహర్నిశమూ నగలు క[illegible]ని ఏడుకొండల వానికంటే [illegible]కక, రెట్లు ఆశ ఆభరణములమీద ఉన్నదన్నాడు. అప్పుడు ఆ సంపన్న గృహస్థునియింటిలోని నారీరత్న మొక కంఠహారమునుతీసి మహాత్మునకు సమర్పించి నమస్కరించెను. ఈ అర్ధదిగంబర ఫకీరుకున్న అర్థకాంక్ష అపరిమిత మనుట అసత్యము కాదు.

ఏసుక్రీస్తు సర్వసంగపరిత్యాగి. సన్యాసి-మహాసిద్ధుడు. యోగిపుంగవుడు - తనప్రాణం మీదకూడా మోహంలేనివాడు. కాని ఆయన కాలంలోకూడా "శాస్త్రజ్ఞులూ పరిసయ్యులు" అని పిలువబడుచుండిన కొందరు కరిష్ఠులూ, సనాతనిస్టులూ ఉండేవారు. తాము చాలా ఉత్తములు సంజాతులమనే భావంతో అహంభావంతో సంచరించేవారు. ఆకాలంలో వారుకూడా కొన్ని తరగతుల వారిని దేవాలయ మంటపంలోనికి రానిచ్చేవారు కారు. అంటే ఏమిటి? తాము ఎవరిని హీనజాతివారుగా పరిగణిస్తున్నారో వారికి ఆలయప్రవేశం లేకుండా చేశారు ఈ సనాతనిస్టులను చూసినప్పుడు ఏసుక్రీస్తునకలిగిన ఆగ్రహం యింతా అంతా కాదు. "*Oh! Ye, Generation of Vipers!*" "అరే! దుష్టసర్పసంతాన సంజాతులారా!" అనిఆయన వారిని సంబోధించి యున్నాడు. ఇంచుమించు ఆయన ఆనాటిపాలస్తీనా దేశములో వెలసిన హరిజనోద్ధారకుడని చెప్పవచ్చు. ఆత్మసంస్కారం లేని ఆరాధనవిధానములవల్ల పాపం పెరిగినదన్నాడు -. తన ప్రాణం బలియిచ్చియైనా యీ పాపాన్ని ఖండిస్తానన్నాడు. చిట్టచివరకు ముక్తి పొందినది ఎవరు? ఏసుక్రీస్తు ముక్తి పొందినాడుగాని, ఆ లోకోద్ధారకుని మూలంగా లోకం ఉద్ధరింపబడిందా? అయిరోపాఖండం అంతా క్రీస్తుమతం అవలంబించింది. అమెరికాలో క్రీస్తుమతం సర్వత్ర వ్యాపించి ఉంది. అయితేనేం! ఈ క్రయిస్తవ రాజ్యాలవారు క్రీస్తుయొక్క ఉపదేశాలను ఉప్పులో ఊరవేసి అవసరమైతే ఆదివారంనాడు చర్చికి వెళ్లినప్పుడు చవి చూస్తూ ఉంటారు. ఈ క్రయిస్తవ ప్రపంచానికి చెందిన తెల్లజాతులవారు ఆఫ్రికాలోని నల్లజాతులవారిని పల్లులవలె మాడ్చివేస్తూఉంటే యీ అధర్మం చూడలేక గాంధిమహాత్ముడు దక్షిణాఫ్రికాలో తన సత్యాగ్రహదీక్ష సాగించాడు. ఆ దీక్షవల్లనే ఆయన మహాత్ముడైనాడు.

ఇంగ్లాండుదేశంలో నౌకాదళ సైనిక శాఖాధికారియైన కమాండర్ స్లేడ్‌గారి కొక కుమార్తెఉంది. ఆమెకు పాశ్చాత్య నాగరికతా విధానంమీద రోతపుట్టింది. పాశ్చాత్య పద్ధతులలో ఆత్మకు శాంతినిచ్చే ధర్మమార్గం ఆమెకు కన్పించలేదు. రోమా రోలెండు అనే మహాకోవిదుని సలహా స్వీకరించి స్లేడ్ కన్య హిందూదేశానికి వచ్చింది. గాంధిమహాత్మునకు శిష్యురాలైంది. "మీరాబేన్" అనే కొత్తపేరుతో, గాంధిమహాత్ముని అనుచరురాలై తిరిగింది. మహాత్ముని మలమూత్రములను కూడా ఆమె అనేక పర్యాయములు తీసివేసి ఆయనకు తల్లివలె సేవచేసింది. అవిఘ్నంగా తాను తరించానని అన్నది.

బిడ్డకు సేవచేసిన తల్లి ఆత్మపరిపక్వమును పొంది తరించడానికి వీలులేదా? ఈ బిడ్డలెందుకు? యీ సంసారకూప మెందుకు? "ఇల్లను నూతిలోబడి" కూపస్థ మండూకము వలె ఉండడం ఎందుకు? అని ఆ కూపంలోని మండూకములు ప్రశ్నించవుసరిగదా, మాండూక్యోపనిషత్తు బృహదారణ్యకోపనిషత్తులలోని ఉపదేశమహాత్తును, కించిత్తు గ్రహించినవాళ్ళు కూడా ప్రశ్నించరు. ప్రహ్లాదునివంటి పరమయోగి కూడా వివాహం చేసికొన్నాడు. సంసారం చేశాడు. సంతానం కలిగింది.

పురుషుడు భోగములను అనుభవించడం భోగంకోసమే అనేటటువంటి సిద్ధాంతం పాశ్చాత్య నాగరికతా సిద్ధాంతం. అందుకనే "*Art for its own sake*" "కళ అనేది కళావికాసంకొరకే" గాని ఇంకెందుకూ కాదు అనే సిద్ధాంతం పాశ్చాత్య పండితులలో బయలుదేరింది. అయితే ఈనాటి రష్యావంటి కమ్యూనిస్టు రాజ్యాలకు ఒక్కటే సిద్ధాంతం వారి వేదాంతంగా వర్తిస్తోంది. మానవుడు ఏ పనిచేసినా సమష్టిశ్రేయంకోసం చెయ్యాలి. సమష్టిగా వ్యవసాయంచేసి సమష్టిగా ఫలసాయం పంచుకోవాలి. ప్రతి మానవుడూ సంఘాన్ని ఉద్ధరించడానికీ, ప్రభుత్వాన్ని ఉద్ధరించడానికి తన ధర్మాలను తాను నిర్వర్తించాలి. ప్రభుత్వానికి జనసంఖ్యాబలం ఎక్కువగా కావాలి అంటే స్త్రీలు ఎక్కువగా బిడ్డలను కనవలెను. దేశంలో జనసంఖ్య అత్యధికంగా ఉన్నట్లయితే, సంఘంలో అనగా దేశంలో ఉన్న జనానికి పండిన పంట చాలదు గనుక ఉన్న జనానికి జీవితభోగములూ జీవిత సౌకర్యములూ సమృద్ధిగా సమకూడుటలేదు గనుక రాజ్యంలో ఉన్న స్త్రీల సంతానోత్పత్తికి మీటరు ఉండాలి. కంట్రోలు ఉండాలి. ఈ విధంగా సంసారం అనేది సమష్టిలాభంకోసం చెయ్యాలి. ఇదే సామ్యవాదం అన్నారు. అంటే ఏమిటి? సంఘాన్నీ దేశాన్నీ లోకాన్నీ ఉద్ధరించడంకోసం, సంసారం చెయ్యాలి. వ్యవసాయం చెయ్యాలి. సమష్టి శ్రేయస్సుకు అక్కరకు వచ్చేది ఆత్మధర్మం అన్నారు. విశ్వశ్రేయమే కావ్యలక్ష్యం అన్నట్టుగా లోకాన్ని ఉద్ధరించే ధర్మం ఏదో అదే నీవూ అనుసరించవలసిన ధర్మం అని నిర్వచించి, ధర్మనిర్ణయం చేశారు.

ఇదంతా నాన్సెన్సు; ఇదంతా అజ్ఞానం అన్నాడుయాజ్ఞవల్క్యుడు-ఆయనమైత్రేయి, కాత్యాయనిఅనేఇద్దరుభార్యలతోసంసారం చేశాడు. భోగాలు అంటే జోడుగుర్రాల బగ్గీకి సారథ్యం అన్నాడు. ఈ సంసారరథంలో ఎక్కినప్పటికీ మోక్షకామికి మనోరథం సిద్ధించగలదు. ఆత్మవిముక్తికి మార్గం సంసారంలో అపారంగాఉంది. విరహతాపం కూడా తపస్సే - తినగా తినగా గారెలు చేదు ఎక్కడమే జ్ఞానప్రబోధం. అడవిలో తపస్సుచేసినా, గుడిసెలో తడిసి కూడులేని కూలివాడు కృశించినా, ఒంటిస్తంభం మేడమీద పరీక్షిత్తు మహారాజువలె ప్రాణంపోతుందేమోనని ప్రాయోపవేశంచేసి పరితపించినా, భోగమువీధిలో వేమనవలె భోగియై రాగియై చివరకు జోగియైతిరిగినా, ఇదంతా కండ్లు మూసికొనిగాని, కండ్లు మూసికొనిపోయిగాని చేసిన తపస్సు అనే మాటలో తప్పులేదు. అజ్ఞానంలోనుంచి ఉదయించేది జ్ఞానం. భోగాపేక్ష కలిగేది అసంతృప్తి. ఈ అసంతృప్తిలా [illegible] వచ్చేది ఆవేదన - దేనికోసం యీ ఆ[illegible]దే మనం చేయవలసిన ఆలోచన. స్థిరమైన సౌఖ్యంకోసం -. స్థిరమైన శాంతికోసం - పరిపూర్ణమైన సౌఖ్యంకోసం శాంతికోసం ఆవేదన కలిగితే అదే అహంబ్రహ్మలోనుంచివచ్చిన వేదం. అదే ఆత్మజ్ఞానానికి సూర్యోదయం. అదే తమస్సు విడిపోయి ఉషస్సు ప్రారంభమయ్యే సమయం - "తమసోమాజ్యోతిర్గమయ" "చీకటిలోనుంచి వెలుతురులోనికి నడిపించాలి అనే ఆవేదన యీ భోగములవల్లనే కలుగుతుంది.

అప్పుడు ఆ భోగాలలోనుంచి కొత్తకాంతులు కొత్తరాగాలు ఉద్భవిస్తాయి. పట్టుపురుగులోనుంచి సీతాకోక చిలుక వింత రంగులతో ఆవిర్భవిస్తుంది. బురదలోనుంచి పద్మం వికసిస్తుంది. భోగం అనేది రూపుమారి, అదే యోగం అవుతుంది. గోపికావిరహంలో భక్తి పరవశత్వం పరిపక్వమవుతుంది.

"పురుషుడె భోగముల్ విడిచి
పొందు నిరామయ శాంతి సౌఖ్యముల్"

భక్తుడు "రాగసుధారసము పానముచేసి, రాజిల్లవె ఓ మనసా! యాగయోగ త్యాగ భోగఫల మొసంగే రాగసుధారసము పానము చేసి రాజిల్లవె ఓ మనసా"అంటాడు. "స్వర రాగ సుధారసయుత భక్తి స్వర్గాపవర్గమురా" అని గానలోలుడైనవాడు త్యాగులలో మేటిత్యాగియై త్యాగబ్రహ్మమగును. వేణుగానలోలుడైనవాని ఆత్మజ్ఞాన తేజస్సు వీణాగానలోలుడైన జ్ఞానవిశారదుని మించి చెన్నారదా నారదా !?

"వర యోగి విరాగి యెట్లగున్?" ★

మోహన్ కి మర్నాడు ప్రొద్దునే పరీక్షలు ప్రారంభం. రాత్రి సుమారు 10 గంటల వరకు చదివి, తండ్రి దగ్గరకెళ్ళి: "రేపు తెల్లవారుజామున లేస్తావా నాన్నా?" అని అడిగాడు.

"ఆ లేస్తా! ఎందుకూ."

"నన్నూ లేపు నాన్నా; చదువుకోవాలి!"

"లేపుతాలే! పోయిపడుకో"

భార్య గదిలోకి రావడం చూచి ఆయన "రేపు పెంద్రాడే లేస్తావటే? "

"లేద్దా మనుకొంటున్నానండీ"

"లేస్తే నన్నూ లేపుదూ! ఆఫీసు పనుంది."

"సరే లేండి!"

ఆమె ప్రక్కగదిలో పడుకోబోతున్న కొడుకువద్దకెళ్ళి "ఏరా మోహన్! రేప్రొద్దున్నే చదువుకోడానికి లేస్తావట్రా?"

"అవునేఅమ్మా"

"అయితే నన్నూ లేపు, మరవకే"

"సరే లేమ్మా!!"

ఆర్. పి. నరసింగరావు, ఆదోని.

# అపోహ



"కృష్ణ"

ఆరోజు కొస్త అలస్యంగా బడికి వెళ్ళాను. వెళ్ళి కూర్చున్న పది నిమిషాలకంతా స్కూలు ప్యూను "మీకు టపాలో ఈ పుస్తక మొచ్చిం"దని తెచ్చి యిచ్చాడు. పత్రిక నాకెందుకొచ్చిందా అని, ఆశ్చర్యపడ్డాను. విలాసం చూచాను. అసలు నాదా కాదాని? నాదే. సందేహం తీరిపోయింది. ఈమధ్య కథలు వ్రాయడం అలవాటు చేసుకుంటున్నాను. స్కూలు పత్రికల్లో తప్ప బైట పత్రికలకు పంపించడం మొదలెట్టలేదు. పుస్తకం తెరిచి వరసాగ్గా కథలన్నీ చూస్తూ పేజీలు త్రిప్పుతున్నాను. ఒకచోట ఆగి చూచాను. "కథ చేసిన గడబిడ" రచన "ఆచార్య" అని ఉంది. అతను కథలు వ్రాస్తాడని తెలుసు. కాని అతనిది కాదేమో! ఎందరు లేరు వ్రాసేవాళ్లు! పుస్తకం ఆఖరు పేజీవరకూ చూచాను. నా పేరుమాత్రం కనిపించలేదు. అంతలో రాధ నా చేతిలో పుస్తకం తీసుకొని చూసింది. అసలు నా కెవరు పంపారు? ఎందుకు పంపారు? అతనికీ నాకూ ఉత్తరాల పరిచయం ఉంది. అతని వాలకానికి, అతని ఆకారానికి అతని మనస్సుకూ తేడాలున్నాయి. అతన్ని చూస్తుంటే, ఏదో జేబులు కొట్టేవాడున్నట్టుంటాడు. చాలా తెలివికలవాడని అతనితో పరిచయమున్నవాళ్లంటుంటారు. అతను నాకు చాలా ఉత్తరాలు వ్రాశాడు. నేను ఒక్క ఉత్తరమే వ్రాశాను. "నాకు ఉత్తరాలు రాయడం మానుకో. ఇది మంచిపని కాదు" అని, అతనే ఈ కథ వ్రాసి తన గొప్పతనం నాముందు ప్రదర్శించుకోవాలనుకున్నాడు కాబోలు! నాలో నేను మురిసిపడ్డాను. ఈలోగా గంటకొట్టారు. బైటికివచ్చి ప్రక్కనున్న మఱ్ఱిచెట్టుక్రింద కూర్చొని అతని కథ చదవకూడదనుకుంటూనే చదవడం మొదలెట్టాను. అంతా నాకథే వ్రాశాడు. నేను వ్రాసిన ఉత్తరం, అతను వ్రాసినవాటిల్లో మంచివో నాలుగు ఉత్తరాలు చేర్చి, ఆఖరుకు అతనితో పెండ్లి జరిగినట్టు కథ పూర్తి చేశాడు. నాకు ఒళ్లు మండింది.

అతను నాదగ్గరున్న పుస్తకాలు- అంటే, నేను వార్షికోత్సవ సందర్భంలో పాడిన పాటలకు బహుమతిగా వచ్చినవి చదివిస్తావని చాలామందిచేత అడిగించాడు. ఇవ్వనని చెప్పినా మళ్ళీ మళ్ళీ అడిగించి ఆఖరుకు రాధ మొగుడితో చెప్పి రాధచేత తెప్పించుకుని చదివాడు. చదివి నాకు పంపుతూ - అందులో అభినందనలు ఆశీస్సులు అందించాడు. నేను మామూలుగానే ఊరుకున్నాను. నాలుగోరోజున ఒక ఉత్తరం వ్రాశాడు. ఒక చిన్న భారతమంత ఉందది.

అమ్మాయీ!, ఈ ప్రపంచంలో మొగవాళ్ళ నేమనాలో నాకర్థం కావడంలేదు. ఏమంటే: ఎవ్వరైనా ఆడపిల్ల నవ్వుతూ ఒకటికి రెండుసార్లు చూచిందీ అంటే, ఇండియా ప్రధాన మంత్రిపదవిలో పడ్డంత సంతోషపడతాడు. ఆ చిరునవ్వుతోనే ఏమైనా అడిగిందీ అంటే, ఇంక సప్తసముద్రాలూ ఈది, హరికౌస్తుభాన్నైనా తెచ్చిపెట్టి మెప్పుపొందుతాడు. పొందాలని ఉబలాటమో, ప్రాకులాటో! ప్రాధేయపడడమో జరుగుతుంది కానీ! ఆడపిల్ల అలా కాదు. మగవాణ్ణి గడ్డిపరక క్రింద కట్టి పారేస్తారు. మళ్ళీ వాలుచూపుతోనే కత్తిరించేస్తూంటారు. ఇది ఎందులో ఉన్నదా అని నాలో నేను చాలాసార్లు ప్రశ్నించుకున్నాను. కానీ సమాధానం దొరకలేదు. ప్రశ్న అలా గుండెల్లోనే ఉండిపోయింది. ...సులో ఏదో అందని సైకలాజికల్ ...పాయింటొకటి నిగూఢంగా గాఢంగా ఉండిఉండాలి. అంతేగా మరి? ఇప్పుడు పుస్తకం నిన్నడిగాననుకో! దాని కెన్ని రికమండేషన్సు? ఎంత హంగామా! నీవు ఇవ్వననీ, నేను చదవాలనీ తాపత్రయపడడం జరిగింది కదూ? అదే నీవు నన్నడిగి ఉన్నట్లైతే, నేను దక్షిణాఫ్రికాలో ఉన్నా ఉత్తరధ్రువాని కెగబ్రాకవలసినా భూనభోంతరాళాలలో, ఈరేడు లోకాలలో గాలించి ఎక్కడున్నా వెతికి, వస్తున్నా వరకే తెచ్చి ఇస్తాను అనేవాణ్ణి; అంటాను అనవా? అంటాను కదూ? ఆలోచించు. ఇది మగవాడిలో ఉన్న బలహీనతో లేక, అబల అనే వంకతో ఆడవాళ్లుచేసే ఇంద్రజాలమో? నాకు తెలియడంలేదు. నేను నీకు పుస్తకాలు తిరిగి ఇస్తూ నీ దగ్గరున్న పద్యాల పుస్తకాలు ఇవ్వమన్నాను. లేకపోతే నీ దగ్గరలేనట్టు తెలియపరచమన్నాను. నా మాటలు తృణప్రాయంగా

ఎంచావు. అయినప్పటికీ సిగ్గులేక, నేనే మళ్ళీ ఈ జాబు వ్రాస్తున్నాను.

ఇదంతా నీదగ్గిర పరపతి సంపాదించడానికేసుమా! పుస్తకాలంటే పంపు. ఇవే మగవాళ్లదగ్గరున్నట్లయితే ఎంత తేలిగ్గా సంపాదించేవాళ్లో! సంఘం అనాదినుండీ స్త్రీనీ పురుషుణ్ణీ వేరువేరుగా ఉండేలా విధించింది. అకట్టుబాట్లకు కట్టుబడి పోవాలి. నిన్ను స్కూల్లో అడగడానికి వీలులేదు. పుస్తకాలన్నావు కదూ? మాయింట్లో, చాలా ఉన్నాయని విన్నాను. నీవు "నేనేమీ సాయం చేయలేకపోయినా, నాకు నీవు సాయం చేయాలి! బహుశా నాసాయం నీవు అక్కర్లేదనుకుంటాను. కాని నాకు పుస్తకాలంటే ప్రాణం. కాని చదవలేను. నా బ్రతుకు నీకు తెలియనిదేముంది? 24 గంటల్లో 8 గంటలు పని, ఎనిమిది గంటలు నిద్ర, 8 గంటలు చదువు ఇదీ నా కార్యక్రమం రెక్కాడితేకాని డొక్కాడదు నేను నీతో ఎగబడి మాటాడితే లోకం తాటాకులు కడుతుంది అనా నాతో నీవు మాటాడాలన్న తలపు నాకు లేదు అసలు నీకు లేదని వ్రాయాల్సిన పనిలేదు. ఎందుకంటే మనిద్దరిమధ్య సంఘం నిర్మించిన కారునలుపు తెర ఒకటుంది. మన స్నేహం ఒప్పుకోదు లోకం దాన్ని పగళ్ళకి తెంచుకోగలుగుతామేమో! అది ఇప్పుడు చేస్తే లోకం మనల్ని ఇరవైఏళ్ళు వెనక్కు నెట్టుతుంది. ఈలోకంలో ఇద్దరు మగాళ్ళు స్నేహంగా ఉంటే లోకం పట్టించుకోదు. ఇద్దరాడాళ్లు అలాఉన్నా లోకమంతే. ఆడా మగా స్నేహంగా ఉంటే ఊరుకోదు. వాళ్లుకూడా ఊరుకోరనుకో!

సెలవు—

—పుస్తకాలబ్బాయ్.

ఉత్తరం పూర్తిగా చదివాక నాకేమీ పాలుపోలేదు. ఊరుకున్నాను. ఇతను ఎందుకిదంతా వ్రాశాడు? ఇంత లోకువగా ఎందుకు వ్రాసుకున్నాడు? మళ్లీ రెండురోజులయింకో ఉత్తరం వ్రాశాడు. దాదాపు అంతే ఉంది. అందులో పాట కూడా వ్రాశాడు; ఇంక వరసగా వ్రాయసాగించాడు. మొట్టమొదట మాట్లాడలేను మాట్లాడలేనూ అని, ఆతరువాత మాట్లాడమనీ బ్రతిమాలుతూ ఇంకో ఉత్తరాలు వ్రాశాడు.

నేను ఒక జాబు వ్రాశాను. "ఏమీ తెలియని నావంటి బాలికను ఇలా నిర్బంధించడం తగదు. మీకిది న్యాయంకాదు మీ ఉత్తరాలవల్ల నేను చదువు మానుకోవలసి వస్తుంది" అని వ్రాశాను. మళ్ళీ ఉత్తరాల వర్షం కురిపించాడు. నాకు విసుగెత్తి ఉత్తరాలు చదవడంకూడా మానుకున్నాను. జవాబు ఇవ్వలేను. అతనికూడా విసుగు పుట్టింది కాబోలు; ఊరుకున్నాడు. ఈవిషయమంతా రాధకు చెప్పాను. అతన్ని చూపించి - రాధ "అతను రౌడీ. చాలా దుర్మార్గుడు" అని అరగంట లెక్చరిచ్చింది. అది చెప్పినవన్నీ నిజం కాదని తరువాత తెలుసుకున్నాను. ఊరుకున్నాను. తరువాత అతను వ్రాసిన ఉత్తరాలన్నీ కలిపి కథ వ్రాసిపంపాడుకాబోలు ననుకున్నాను. కథ చదివి రాధకు చెప్పానిదంతా. అతనెక్కడన్నా కనిపిస్తాడేమో! అడుగుదామనుకున్నాను. ఆ సాయంత్రమే మా అన్నయ్య స్నేహితుడు గోపాల్ మాఇంటికి వొచ్చాడు. అతనితో ఈ విషయమంతా చెప్పాను. విని "ఈ కథ అతను వ్రాయలేదు" అన్నాడు.

"మరి అతని పేరుందికదా?" అన్నాను.

"ఉన్నా సరే. అతనుమాత్రం వ్రాయలేదు. అతను నా స్నేహితుడు. అతను వ్రాసిన ప్రతి కథా నాకు చూపుతాడు."

"మా ఉత్తరాల సంగతో?" అన్నాను.

"అన్నీ నాకు తెలుసు. నీ జవాబుకూడా నాకు తెల్సు. ఆరోజే మానుకున్నాడు అన్నీ."

"అతను నీ స్నేహితుడా?" అన్నాను.

"అవును" అన్నాడు.

"అతనితో చెలిమి మానుకో" అన్నాను.

"అతని విషయం నీకు తెలియదు. అతను చాలా మంచివాడు" అన్నాడు

"నీ స్నేహితుణ్ణి నువ్వు మెచ్చుకోవలసిందే" అన్నాను.

"పోనీలే!" అన్నాడు.

"అతనితో మాట్లాడితే, నీవు మా ఒ రావద్దు" అన్నాను

గోపాల్ వెళ్లిపోయాడు. వారం తిరిగింది. రాధకీ విషయం తెలిసింది. అది స్కూలంతా గోల చేసింది స్కూల్లో వాళ్ళంతా వేలుపెట్టి చూపి గుసగుసలాడుకోవడం చాలాసార్లు చూశాను. శనివారం సాయంత్రం దేవాలయంలో కనిపించాడు. నావెంట ఒకమ్మాయి ఉంది. ఇద్దరం ప్రక్కన కూర్చొని సూటిపోటులుగా చాలా మాటలూ అన్నాము.

అతను అన్నీ విని, "నిజం నిలకడమీద తెలియాలి బ్రహ్మం" అని తత్వం పాడుకుంటూ వెళ్ళిపోయాడు. ఇంత సిగ్గులేనివాడేమా? అనుకున్నాను. స్కూల్లో అంతా అల్లరిగా ఉంది.

ఈవిషయం మా టీచరు ఒకామెకు తెలిసింది. నన్ను వాళ్ళింటికి తీసుకువెళ్లింది. "అమ్మాయ్ ఏమిటా కథ చేసిన గడబిడ?" అంది.

"నాకేం తెలియదండీ" అన్నాను.

"ఆచార్య నీకు ఉత్తరాలు వ్రాశాడా?" అంది.

నేను పలకలేదు.

"ఆ కథ నేనే వ్రాశాను. నీకు వచ్చిన ప్రతి ఉత్తరం ఒకరోజాలస్యంగా ఒచ్చేది. నీవా విషయాన్ని గమనించలేదు. అన్నీ కాపీ తీసుకుని నీకు పంపాను. నీ విషయం ఆలోచిస్తూనే, అతనూ కూడా మథనపడుతున్నాడు; అతను వ్రాయందే కథ వచ్చినందుకు; అతను వ్రాసిన ఉత్తరాలన్నీ కథలో ఉండటంవల్ల కథ నీవేవ్రాసి అతన్ని గోల చేశావనుకుంటున్నాడు. ఇంక జన్మలో అతను ఉత్తరాలు నీకు వ్రాయడు" అంది. నేనేమనాలో పాలుపోక, "రాత్రి అతన్ని గుళ్ళో తిట్టానండీ." అన్నాను.

"తిట్టావా?" అంది.

"అవును" అన్నాను.

"బలేపని చేశావు" అంది.

"అయితే అతనిపేరెందుకు పెట్టారు?" అన్నాను.

"ఉత్తరాలన్నీ అతనివే! ఆకథలో ఏముంది? అన్నీ ఉత్తరాలేగా! పోతే కథలో ఆఖర్ని పెండ్లి జరిగినట్టు కల్పించాను" అంది.

నేనేమీ మాట్లాడలేకపోయాను.

"అతను ఉత్తరాలు చాలా బాగా వ్రాశాడు. నిజంగా అలా ఉత్తరాలు వ్రాసేవాళ్ళుంటే ఎంత బాగుంటుంది?" అన్నదామె.

నేను వచ్చేశాను. వస్తుండగా అతనూ గోపాల్ బాటనే వెళుతూ నన్ను చూశారు. అతను గోపాల్‌తో "కథ చేసిన గడబిడేలా ఉన్నా, గుళ్ళో చకోరసుళ్ళు బాగా ఉన్నాయి గోపాల్" అన్నాడు.

వెళుతూ వెళుతూ "గోపాల్! నిన్ను అమ్మ రమ్మంది" అన్నాను. సాయంత్రం ఇంటికివచ్చాక అన్నీ గోపాల్‌తో చెప్పాను. గోపాల్ నాతో మాట్లాడకుండా అమ్మతో మాట్లాడి వెళ్లిపోయాడు; మర్నాడు స్కూలుకు ఒక ఉత్తరం వచ్చింది. అందులో "తెలుసుకున్నందుకు చాలా సంతోషం" అని ఉంది.



# స్వర్గంలోనే పెళ్లిళ్లు

ఇసుకపల్లి లక్ష్మీనరసింహశాస్త్రి

(రవి యింట్లో)

రవి: మేనమామపోలికలు రాకపోతే యింత అవస్థపడేవాళ్లం కాదుగదా అమ్మాయి సంబంధాన్ని గురించి.

వసంత: ఏముంది అనటానికి. నాకు తెలియని రోజుల్లో పెళ్లి చేశారు కాని, లేకపోతే మిమ్మల్ని చూసి వరించే దానరండి. అందుకనే అమ్మాయి పెళ్లికి సతమత మవుతున్నాం. పోలికలు యెక్కడికిపోతాయి.

రవి: నేనేదో తమాషాకనంటే, బాగానే వుంది నీ సరసం. మనిద్దరము తగూలాడి పిల్లను వుప్పదపెడతామేమిటి?

వసంత: అందుకనే మా అన్నయ్య కొడుకు వున్నాడని మొత్తుకుంటూనే వున్నా...

రవి: మళ్లీ ఆమాటే...ఎన్నిసార్లు చెపితే యేం?

వసంత: అదీ వరస. దేవుడు సృష్టించిన దానికి మన యిద్దవాళేమిటో...అందము యేమన్నా కొరుక్కుతినేదా...

రవి: ఆ వృద్ధికానపడేగా నిన్ను చేసుకుంది...

వసంత: అదుగో మళ్ళీ అదేమాట... మీకు యిష్టంలేకపోతే సరేకాని వంకలు మాత్రం అనవసరంగా పెట్టకండి...అమ్మాయికి పదహారేళ్లు వెళ్ళిపోతాయి ఫాల్గుణానికి తెలుసా...

రవి: ఏం ప్రమాదంలేదు. పాతికలు వెళుతుంటే దిక్కులేదు కాని, పట్టుమని పదహారు నిండలేదు. దాని కింత ఆర్భాటం యెందుకంట!...

వసంత: అయ్యోరామ యెంత వుప్పలాయి...మీ తరహా చూస్తే పాతిక వెళ్ళనిచ్చేటట్లే వున్నారు.

రవి: నా ప్రయోజకత్వము యేముంది యిందులో. కాలాన్ని యెవరైనా ఆపగలరా! మనం పెళ్ళిచేసేదాకా అమ్మాయికి యేళ్లురాకుండా వుంటాయా!...



సంతకి — వి. నరసింహారావు, రేవేంద్రపాడు

వసంత: నిజాలే పలుకుతున్నారు కాని, ఆ ఘడియ యెప్పుడూ అంట...

రవి: నేనూ అనేది అదే...

వసంత: ఇప్పటికి డజను అయ్యారు. వకకిళ్ళ నచ్చకపోతే యింకా యెట్లాగండి వచ్చేది.

రవి: దాన్నిబట్టి అమ్మాయిని చూసి యెవరూ చేసుకోరు అనే నిర్ధారణ అయిపోయింది.

వసంత: మాస్టేసీ లేకపోతే, తెర చాటున వుంచి చేసుకోవటానికి మన పెళ్లి టండీ!...

రవి: ఆ...ఏమన్నావు... నేను అదే వద్దన్నా. మనము పూగుకోలేక కాలక్షేపంగా అనుకోవటమే కాని, ఆ చతుర్ముఖుడు వక్కసారే వ్రాశేస్తాడు గట్టిగా తప్పో, వప్పో, అది మనకు తెలీక వలలో పడ్డ చేపల్లాగ తన్నుకుపోతూ వుంటాము.

వసంత: ఏముంది ఏం చేతకాకపోతే సరి వేదాంతం వుందిగా –

రవి: అదే తొందరమాట. వేదాంతం అర్థం కాలేదను బాగుంటుంది. అంతేకాని, నీకు అర్థం కానివన్నీ అర్థం లేనివంటే యేమిటి అర్థం!...

వసంత: చూడండి యీ మాటలకేంకాని, అమ్మాయిమనస్సు యెంత బాధపడుతోందో మీకేమన్నా తెలుస్తోందా!...పాపం పిచ్చి పిల్లలాగ పెళ్ళిచూపులకు వస్తున్నారంటే, తానెంతో శృంగారించుకుని, అమ్మ యెట్లా వున్నానో చూడు అంటే, నా కడుపు తరుక్కుపోతుందండి. ఇంతకీ అమ్మాయి ముఖాన పెళ్లియ్యే గీత వుందో లేదో...

రవి: ఏడవటం ప్రారంభించావు. ఇంత సేపటినుంచి లేదేమో అనుకున్నా. ఇక చాలేకాని, కురూపులకు పెళ్లవుతూంటే లేదుకాని అమ్మాయివిషయానికా నీదిగులు. బ్రహ్మ మొదట బొమ్మల్ని చెయ్యంగానే వీళ్ళిద్దరు జంటా అని యేర్పరుస్తాడే... ఆరహస్యము నీకు తెలీదు. ఎక్కడోపుట్టి నాఅల్లుడుసుఖంగా పెరుగుతూ వేవున్నాడు.

వసంత: నిజంగానాఅండి. ఎక్కడున్నాడండి మన అల్లుడు.

రవి: ఏడిసినట్లే వుంది. అది తెలిస్తే యింకేం...అది తెలియకే యీ సతమతమవటం.

వసంత: మరయితే అది యెట్లా తెలుస్తుందండి....

రవి: పెళ్లయితే తెలుస్తుంది...

వసంత: అయ్యో! రామ, మీ అంత మొండివారు ప్రపంచంలో పుట్టబోరు. నా దిగులుతో నేను బాధపడుతుంటే, మీకేమో పరిహాసాలేను.

రవి: మనకు అర్థం కానివన్నీ పరిహాసాలే. సృష్టిచిత్రం తెలుసుకోవటం ఎవరి తరం... నేను యీసారి పంపిన కబురు గట్టిదే. ఈసారి రేటు కొంత పెంచినట్లు పుకారులాంటిది బజార్లో వేశాను. దాంతో నన్నా యే వక్కడైనా ముందుకు రాకపోతాడా అని.

వసంత: ఏమన్నా రేమిటి.

రవి: అనటానికి యేముందని నాలుగైదు దాక అమాంబాపతు కలిసి ముట్టచెపుతాను అని.

వసంత: అంత కట్నం పరాయివాడికి యివ్వకపోతే...

రవి: మళ్ళీ అదేమాట...

వసంత: అయితే యీసారి అమ్మాయి పెళ్ళిచూపులకు రాదండి.

రవి: అసలు చూడటానికి వచ్చే దెవరంట!...

వసంత: ఆ...ఏమన్నారు...

రవి: అనటానికి యేముందని, పెళ్ళిచేసుకొనేది అమ్మాయిని చూసికాదుగా... మనం యిచ్చే కట్నంచూసి, నీకా విషయం తెలియలా. కామన్సెన్స్ లేకపోయిన తర్వాత యెన్నాళ్ళు కాపరంచేస్తే యేం....

వసంత: అదుగో వెంకన్న వస్తున్నాడండి.

(వెంకన్న ప్రవేశం)

రవి: ఏమోయి వెంకన్నా యెట్లా వున్నాయి మార్కెట్టురేట్లు!

# ★ స్వర్గంలోనే పెళ్ళిళ్ళు ★

వెంకన్న: సెప్టెంబరులో కాని యీసారి గిరాకి పెరగదనుకుంటున్నారండి...

రవి: అంతా ఫెయిలే...ఎందుకొచ్చిన ఖరఖాలంట... బియ్యే ప్యాసయినవాడిని తెలుగులో అచ్చు అక్షరాలు యెన్నో చెప్పమను.

వెంకన్న: అవన్నీ యెవరికి కావాలండి. మీరంతా వెనకందల మనుష్యులు. కాని తము చేతికి వచ్చిందా లేదా అదే ప్రశ్న.

రవి: నేను పూరికే అంటున్నా కాని, అంతేలే నిజానికి

వెంకన్న: అయితే బాబుగారు, యీచౌక లోనే యేమన్నా మనం తథాస్తు అనుకుంటే బాగుంటుందని నా అభిప్రాయమండి.

రవి: తొందరపడితే అయ్యే పనులుటయ్యా! శాస్త్రం నీకు తెలీదు. ఆ ఘడియ రావాలి కాని, అవుతేమాత్రం ఆగుతుందిటయ్యా!...

వసంత: వెంకన్నా, ఏదో నాలుగువుల్లగింజలు వచ్చేవాడు బుద్ధిమంతుడు...

రవి: ఇవన్నీ హిర్యణాక్ష వరాలు కోరేవా పెట్టేవా!...నామాట విను. మనకు కావలసింది అవయవాల్లో యేమీ లోపం వుండకూడదోయి ఆస్తి అక్కర్లేదు. మగవాడయితే చాలు. నువ్వేమన్నా హామీ యిస్తానంటే, యిప్పటికప్పుడే భజంత్రీ వాళ్లకు కబురుచేస్తా. అంతే. నిమిషాల మీద జరిగిపోవాల్సిందే...ఆ మూడుముళ్లు పడ్డాయి అని అనిపిస్తే చాలు అంతే నాకు....

వెంకన్న: తొందరపడితే జరిగే పనులుటండీ. మీరన్నట్లు ఆ ఘడియ రావద్దూ.

వసంత: వారికి తగ్గవాడివే దొరికావు నాయనా, ఏమో అనుకున్నా..ఇంట్లో గోళ్లు గిల్లుకుంటూ కూర్చుంటే, అల్లుడు వచ్చి పాదాలముందు వాలతాడా నాకు తెలీక అడుగుతా...

రవి: అబ్బే కాదు బజార్లోకి పోయి ంతులు వేస్తే ప్రత్యక్షమవుతాడు ంతేనా!...

వెంకన్న: ఆ ఘడియ రావాలే కాని, పత్యక్షమవక యేమవుతాడు.

* * *

## రెండవ రంగం

రఘుపతి: ఏమిటోయి సృష్టిలో అందరూ మాదిరి బొమ్మలే వుంటాయనుకుంటు న్నావాయేమిటి? ఈ అయిదు వేళ్లు వకటిగా న్నాయి ... ఇంకేం మరి ... ఇప్పటికి గాతిక సంబంధాలు చూడటం అయింది. నీకు వచ్చినపిల్ల వచ్చేటప్పటికి యిప్పటి వరకు చూపులకు అయిన ఖర్చుయినా కట్నం రూపంగా గిటుతుందా అని...

సుజాత: వాడిముఖాన యెల్లా వ్రాసిందో యెవరు చెప్పగలరు పెద్దమ్మ నెత్తిమీద కూర్చుంటే యెవరుమాత్రం యేమి చేస్తారు. మననోరు ఆగలేక వాడిని అడిపోసుకోవటమే కాని వాడిని అనాలసిన పాపము యేముంది! బుద్ధిః కర్మానుసారిణి అని పూరికేఅన్నారా .........

వేణు: మీబోటి రకం వినేవాళ్లుగా తయారయితే యేదైనా అంటారు. అనకేం చేస్తారు. తిన్నదిఅరగద్దూ. పనాపాటా!...

సుజాత: ఎట్లాగయితే యివ్వాళ కళ్ళు తెరిచావు. గ్రుడ్డొచ్చి పిల్లను వెక్కిరించినట్లు...

రఘుపతి: నీ దాహానికి తగ్గట్లు నీళ్ళుపోసే వాడు వచ్చాడుగా మొన్న. యేం మాట్లాడక పోయినావు...

వేణు: నువ్వు చెప్పటానికేంలే. చూస్తూ చూస్తూ ఆ పిల్లను చేసుకోమంటావు...

రఘుపతి: అవ్వా కావాలి. బువ్వా కావాలి. యెట్లా కుదురుతుంది చెప్పు. లోకం అన్న తర్వాత పడి యెడమ అన్నారు.

వేణు: నేను చెపుతున్నా గా...కనీసం బియ్యే ప్యాసయినదైనా వుండాలి. లేకపోతే ప్రపంచజ్ఞానము తెలిసినదైనా అవాలి. అందంలో నాకు ఏమాత్రం జంకకూడదు...

రఘు: డబ్బు పుష్కలంగా నాలుగైదు తరాలదాక వేదాంత చర్చలోకి దిగకండా వుండాలి హాయిగా వంటి అంతస్థు మేడ మీద కూర్చుని అబ్బాయి కూనిరాగాలు తీస్తుంటే అమ్మాయి వచ్చి కాఫీ అందించాలని మోజు. ఏం కోరిక ఏం కోరిక. మానవుడై పుట్టిన తర్వాత యీమాత్రం కూడా వూహించలేని వవట యెవరో నాకు చెపుదూ.

సుజాత: అట్లా అంటావేమిటి అన్నయ్యా, మన అబ్బాయి కోరటంలో ఆశ్చర్యము యేముందంట!

రఘుపతి: అమ్మాయి గురిగింజ నలుపు సంగతి యెరుగదుట. తెలిసిందా! ఈ వివాహము అనేది మన చేతుల్లో వున్నది కాదు. అంతా అదివరకే జరిగివుంటుంది. మనం మాత్రం నిమిత్తమాత్రులం.

వేణు: ఈ వేదాంతం యివ్వాళిటిదా! నేను క్రొత్తగా వింటున్నాను కనకనా!....

సుజాత: ఒక్కటే ముక్కరా. ఇప్పుడు అబ్బాయికి నచ్చింది రావాలి...

రఘుపతి: అక్కడే వస్తుంది. వచ్చటం అంటే యేమిటి ఆ పంతంమీద వుండ పట్టేగా యిన్ని సంబంధాల్ని వనేమిరా

## రచయితలకు మనవి

మాకు కథలు, గేయాలు, చిత్రాలు, ఫొటోలు పంపేవారు ఈ క్రింది అంశాలను గమనించ ప్రార్థన.

ప్రచురించని వానిని త్రిప్పిపంపగోరే వారు బుక్ పోస్టుకు అవసరమైన స్టాంపులను, రచనలూ, చిత్రాలూ, ఫొటోలతోనే చేర్చిపంపాలి.

బుక్ పోస్టుకు అణా స్టాంపుకు తక్కువ కాకుండా పంపాలి.

రచనలను కాయితానికి ఒకే వైపున సిరాతో వ్రాసిపంపాలి.

ఫొటోలు కనీసం కార్డు సైజులో వుండాలి. నెగెటివ్‌లు స్వీకరించబడవు.

చిత్రాలు ఇండియన్ ఇంకుతో వేసిపంపాలి. రంగుల చిత్రాలు స్వీకరించబడవు.

ప్రచురణ విషయాన్ని వెంటనే తెలియచెయ్యడం కష్టం.

నిరాకరించబడిన రచనలను త్రిప్పి పంపడానికి మాకు కనీసం ఒక మాసమైనా వ్యవధి అవసరం. ఫొటోలు, చిత్రాల విషయంలో యింకా ఎక్కువ వ్యవధి కావలసివుంటుంది.

ప్రచురించే వానిని గురించి ప్రచురించే ముందు మాత్రమే తెలియపరచగలను.

మాకు పంపిన రచనలను, ఫొటోలను, చిత్రాలను గురించి మా కార్యాలయం నుంచి ఎవ్విధమైన సమాచారమూ అందనిదే, వాటి ప్రతులను యితర పత్రికలకు పంపవద్దని ప్రార్థన.

రచయితలూ, చిత్రకారులూ, సహృదయంతో సహకరించగలరని విశ్వసిస్తున్నాము.

—సంపాదకుడు.

భర్త గడపదాటుతుండగానే భార్య అడిగింది: "ఈ వేళ తొమ్మిది గంటలకల్లా ఇంటికి వచ్చేస్తారు కదూ?" అని.

"లేదు, పది..... పది..."

"ఏమిటీ?"

"అబ్బే! ఏమీ లేదు పది నిమిషాలుతక్కువ తొమ్మిదికే వచ్చేస్తానని అంటున్నాను."

అంటూ వచ్చేవాళ్ళేం లేదు వాళ్ళందరకు పెళ్ళి కాదనా...

వేణు: అదెవరన్నారు...

రఘుపతి: నీకు తెలియకపోతే చెప్తున్నా.. చాలామంది పిల్లల తల్లులయ్యారంటే నమ్ము. మనవాడు యెక్కడున్నాడో అక్కడే...

సుజాత: అయితే యేం చెయ్యమంటావు..

రఘుపతి: అయితే నేను చెప్పినట్లు చెయ్యమను. అందాలు, డబ్బు శాశ్వతమేమిటి కనక, సుఖమైన దాంపత్యము కుదరాలి. దానికోసం యెవరోఒకర్ని నిశ్చయం చేసుకోవాలి ఏమిటా ఆలోచన.

సుజాత: ఏమిటో పిచ్చివాడులాగ ఆలోచిస్తూ ఆలోచిస్తూ రోజులు గడిపేస్తున్నాడు.

రఘుపతి: ఇట్లాగే ఆలోచిస్తూవుంటే పిచ్చియెక్కినా ఆశ్చర్యంలేదు. పిచ్చి బ్రహ్మాండమైన జబ్బేమీ కాదు. మనస్సు ఒకదానిమీద లగ్నం చెయ్యలేక స్థిమితం తప్పిపోవటమే...దానికి యేకారణమైనా చాలు...

వేణు. మామయ్యా.. ఇది చివరిసారి. చాలుసార్లు తిరిగివస్తాను, నాకు నచ్చిన పిల్లనన్ను పెళ్లిచేసుకోవాలని అనుకుంటే టెలిగ్రాం యిస్తాను వచ్చేసెయ్యండి.

(వేణు నిష్క్రమణ)

సుజాత: జాగ్రత్తగా వెళ్లిరా నాయనా...

రఘుపతి: వాడి పిచ్చిగాని ఇన్ని సంబంధాలువస్తే యివన్నీ కాదనీ, యెక్కడికో వెళతానంటా లేమిటంట...

సుజాత: ఏమో వాడికి బుద్ధిపుట్టి వెళ్ళాడుగా...ఎట్లా అవుతుందో చూద్దాము

రఘుపతి: నిశ్రమగాని వాడి కోలతబద్దలకు సరిపోయే పిల్ల దొరుకుతుందా అని...

సుజాత: ఏమో యెట్లా వ్రాసివుందో. ఎవరికి తెలుసు. పుట్టంగానే జత యేర్పడే వుంటుందని అంటారు మరి. వీడు యీపూట్లు వెళ్ళటమేమిటో యిదంతా నాకు ఆశ్చర్యంగానే వుంది...

రఘుపతి: ఆఘడియ రావటానికి యింకా వ్యవధి వుందన్నమాట. లేకపోతే వీడికి యీబుద్ధి పుట్టదు...

*   *   *

(వెంకన్న ప్రవేశం)

వెంకన్న: బాబుగారూ నమస్తే అండి. నేనూ వెంకన్నను. రవీంద్రనాథ్ గారిదగ్గర ఉంటూవుంటాను వారి అమ్మాయి సంబంధం విషయంలో, మీ అబ్బాయి వున్నాడని తెలిసి వన్నిక్కడికి పంపించారు. ఏదో చదువులమీద...

రఘుపతి: ఆ...ఆ...నీ చెవిదాక యెప్పుడు వచ్చిందయ్యా...

వెంకన్న: గొప్పోళ్ళ విషయాలు రాక యెక్కడికి పోతాయంట...

రఘుపతి: నిజమేలే...పిల్లవయస్సు...

వెంకన్న: పదహారేళ్లండి...రవీంద్రనాద్ గారికి చదువులంటే మహామోజండి మీ విషయం తెలిసి యిక్కడకు పంపించారండి...

రఘుపతి: ఎందాక వుందేమిటి వ్యవహారం...

వెంకన్న: మా అయ్యగారు అంత సుళువుగా బైటపడే మనిషికాదండోయి... అయినా మీ రెందాకా వున్నారో శెలవిప్పించండి...

రఘుపతి: నువ్వు గొందురు నన్నే ప్రశ్నిస్తున్నావే. మేము యెంత అడిగితే అంత యివ్వగలరా...

వెంకన్న: లండను చదువు మా రవీంద్రనాధ్ గారికి తెలియని విషయం కాదండి.

సుజాత: అన్నయ్యా...

రఘుపతి: నువ్వూరుకో నేను చెపుతాగా ...మా వాడు కొంచెం పనిమీద వూరు వెళ్లాడు. ఇవ్వాళే వస్తాడు.

వెంకన్న: రానీండి. వచ్చినవాణ్ని పని పూర్తిచేసుకోకుండా వెళతానా...

సుజాత: అదుగో అబ్బాయి అనుకుంటూ వుండగా వచ్చాడు నూరేళ్లాయుస్సు.

వేణు: పెళ్ళి...పెళ్ళి...పెళ్ళి...నా కంటికి అందమైన స్త్రీ ఒక్కర్తె కనిపించకపోతే. కనిపించిన యిద్దరికి పెళ్ళిళ్లు అయిపోయినాయి. ఇక నేను పెళ్ళిచేసుకోను. అసలే పెళ్ళిచేసుకోను.

సుజాత: చూడు నాయనా.....అంత చిరాకుపడక. ఇదిగో యీయన ఒక సంబంధం...

వేణు: సంబంధముసంగతి నా దగ్గర యెత్తకండి. ఒళ్ళు మండిపోతోంది.

రఘుపతి: వేణు...

సుజాత: నాయనా తొందరపడక, నీ చదువుకు సరిపోయేటట్లు పుష్కలంగా డబ్బు...

వేణు: డబ్బు...డబ్బు...డబ్బా! నిజంగానా...కట్నం యిస్తారా నా చదువుకు..

వెంకన్న: చిత్తంబాబు..ఎంతైనాసరే.. మీకు వీలుంటే నాతోనే రండి పిల్లను చూడటానికి...

వేణు: ఛీ! ఇంకా నా జీవితంలో పెళ్లికి పిల్లను చూడటమా! ఎంతమాట అన్నావు. మా మయ్యా శుభలేఖలు అచ్చుకొట్టించేశెయ్యి. డబ్బంతా పెళ్లిపీటలమీద రాలాలిసిందే...

వెంకన్న: ఇప్పుడేవెళ్ళి రవీంద్రనాథ్ గారికి చెప్పేస్తా...

*   *   *

(మూడవ రంగం)

వెంకన్న: బాబుగారు అమ్మాయికి ఒకటవ రకం సంబంధము కుదుర్చుకవచ్చా.

రవి: నిజంగానా...ఎవరూ ఏమిటి....

వెంకన్న: మంచి అందగాడు, ఆస్తిపరుడు, విద్యావంతుడు.

వసంత: నిజంగానా...

రవి: నేను చెప్పలా, వివాహాలు స్వర్గంలో అవుతాయని. లేకపోతే మన పిల్లకేమిటి యిలాంటివాడు అల్లుడుగా రావటమేమిటి? ★

చనిపోయిన ఖాతాదారుని భార్యకు ఇన్సురెన్సు పైకం చెక్కు అందిస్తూ కంపెనీ మేనేజరు "మీ వారు అకాల మరణానికి గురైనందుకు చాలా విచారిస్తున్నాం" అని ఓదార్చాడు. ఆమె రుసరుసలాడుతూ అన్నది:

"ఒక దిక్కులేని విధవరాలు ఏదో నాలుగుడబ్బులు తెచ్చుకుని సుఖపడటం చూడలేకనా బాబూ మీ విచారం?" అని.



# ఆశ

## 1

మండువేసవి. మిట్టమధ్యాహ్నం. వేడిగాడ్పులు. నిర్మానుష్య మైన రోడ్లు. ఆకలితో వికారంగా అరిచే పక్షులు - కాకులు ఒకేపనిగా చేసే గోల - అప్పుడప్పుడు సోడా, లైమ్‌జ్యూస్ కేకలు.

ఈ ఎండని, వేడిగాడ్పులని లక్ష్యపెట్టనట్టు ఊరికి ఒకమూల చిన్న వీధిలో ఒక పూరింట బయలువెడలి, ఆ ఇంటి పరిసరాలనుదాటి సాధ్యమైనంత దూరం పోయేందుకు ప్రయత్నిస్తోంది ఒక జోలపాట - స్త్రీ కంఠం - ఆ కంఠం సంగీత విద్వాంసుల క్రింద ఏళ్లతరబడి తరిఫీదు పొందకపోయినా, శ్రావ్యంగానూ, సహజంగానూ ఉంది. పాటలో అర్థం ఏమీ లేకపోయినా కంఠంలోనుండి వెలువడిన, అది తనలోని ఏదో అమాయకత్వాన్ని జీర్ణించుకోని దని ఏదో కోరికను వెలిబుస్తున్నట్టు, తెలియని ఎవరినో జాలిగా సహాయం అర్థిస్తున్నట్టు ప్రతిధ్వనిస్తోంది.

మట్టిగోడలు, పూరిల్లు అయినా, గది శుభ్రంగా అమర్చబడిఉంది. ద్వారానికి రకరకం 'కర్టెన్లు' - గదికి కిటికీలంటూ లేవు. ద్వారంగుండా వచ్చే వెలుగే, గదిని కాంతివంతం చేస్తోంది. ద్వారానికి దగ్గరగా ఒక పాత కుట్టుమిషను. క్రిందని, బల్లమీద కత్తెర, కత్తిరించిన గుడ్డలు. ప్రక్కనున్న గూటిలో తయారయిన దుస్తులు, వేరువేరుగా పేర్చిఉన్నాయి - రవికలు, డాడీలు, చిన్నచిన్న గౌన్లు—

ఉయ్యాల ఊపుతూ పాడుతున్న నాగమణి మనస్సు పాటమీదా లేదు - ఉయ్యాలలో నున్న 'పాప' మీదా లేదు. కలగంటున్నట్టు, ఎదురుగా నున్న గోడను చూస్తున్నాయామె కళ్లు - గోడ కూడా ఖాళీగానే ఉంది - దానినుంచి కూడా ఆమె కర్థమయ్యే దేమీ లేదు. ద్వారాని

యం. వి. రామారావు

కెదురుగా, మంచంమ్మీద కూర్చున్న ఆమె ముంగుర్లు, వీచేగాలికి ఎగిరి, నుదుటిమీద నుండి, ఆమె కళ్ళలో పడుతున్నాయి. ఎర్రటి ఆమె పెదవులు, పాట కనుగుణంగా కదులుతూ విర్చి పేర్చినట్టున్న పలువరుసని వెలిబుస్తున్నాయి. అందమైన ఆ ముఖానికి మరింత ఆకర్షణకలుగ జేస్తున్నాయి ఎర్రటి బొట్టు, రెప్పలకున్న కాటుక—

పాటలోని మధురస్వరాలకి, ఊచేటప్పుడు తల్లి చేతులగాజులు చేసే చిన్న చప్పుడుకి నిద్రపోయిన పాపాయి ఉఛ్వాస నిశ్వాసాలు వీచే గాడ్పులలో కలిసిపోతున్నాయి.

పాపాయి నిద్రపోయినా ఆమెపాట ఆపలేదు. నోరు పాడుకపోతోందికాని, ఆమె మనస్సు ఏవో సమస్యలని పరిష్కారం చేసేటందుకు దారులు, తెన్నులు వెతుకుతోంది.

ఎందుకో ఈరోజామె మనస్సు విచారంగా ఉంది. బ్రతుకులోని బాధలు, దుఃఖం ఆమెకు అలవాటయిపోయినా, వాటిని రోజూ ఆమె పట్టించుకోక పోయినా, ఈరోజు నాలుగేళ్ళనాటి ఒక తారీకు ఆమెకు జ్ఞాపకమొస్తోంది. ఈరోజటి తారీకే!

ఆమె కుడిప్రక్క గోడకుంది ఒక యువకుడి 'బస్టు' ఫోటో పెద్దది. ఆ పెదవులమీద అనాయకంగా నవ్వు - చిన్న మీసకట్టు - నొక్కునొక్కుల క్రాపు - చురుకైన కన్నులు - ఆ కన్నులే తనని లొంగదీసుకున్నాయి! బానిసగా చేసుకున్నాయి వాటికి తనని! మరుగుపడ్డ ఆశలని రే... చేయి!

పటానికి అలంకరించిన గులాబీపూ... వాడిపోయిందప్పుడే. అగరువత్తులు పోయి, ఒకప్పుడు తమున్నందుకు చిహ్నంగా వదిలాయి వాటి జాడలు అద్దం మ్మీద.

బయట గుమ్మంలో అలికిడయింది. పదమూడేళ్ళ అమ్మాయి గుమ్మంవద్దకి వచ్చి పిల్చింది - "అమ్మగారూ!" - ఆమె కుడి చేతిలో మడచిన వాయిలు గుడ్డ ఉంది. రెండవ చేతితో, అప్పుడే వేసున్న జడ సరిజేసుకుంటూ లోనికి వచ్చేందుకేదో అభ్యంతరమున్నట్టు నిల్చుండిపోయిందామె ఒంటి మీద కొత్త ఖరీదైన బట్టలు, కాళ్ళకు కుంకుమరంగు స్లిప్పర్లు. ఒకరకంగా కలవారి పిల్లలానే కనిపిస్తూంది.

నాగమణి ఈ ప్రపంచంలోనికి వచ్చినదానిలా అయి, పాట ఆపి, అంది. "రా కాంతం!" నాగమణి ఆమాటలనడమే తడవుగా ఆ అమ్మాయి గదిలోనికివచ్చి, ఏదో తొందరపని అవతల ఉన్నదానిలా, ఎటో పోవాలన్నట్టు గబగబ చెప్పక పోసాగింది, కీచుకంఠంతో - "అమ్మగారూ! ఒస్తూ ఉంటే దారిలో రత్నమ్మగారు కనిపించి ఇది మీకిమ్మన్నారు-" బాడీ జేబులోనుండి ఐదురూపాయలనోటుతీసి అందించింది. నాగమణి ముఖం

వికసించింది కాంతం. ఆ డబ్బుకోసం రత్నమ్మగారింటికి రెండుసార్లు వెళ్ళింది తను పాపకి పాలడబ్బా కావల్సొచ్చి. కాంతం ఆగకుండా ఎక్స్‌ప్రెస్ బండీలా చెప్పుకపోతోంది. "పిల్లల జుబ్బాల డబ్బు, రేపు బంట్రోతుద్వారా పంపుతానన్నారు- అన్నట్టు - ఇవాళ మిషను వేసేదా అమ్మగారూ? కత్తిరింపు ఒచ్చేసినట్టేగా... అన్నట్టు చిన్న జుబ్బాకి బట్ట కత్తిరించారండీ - మా చిన్నతమ్ముడు రోజూ మరాం పెడతాడు వాడికో లాల్చీ కుట్టిఇవ్వమని పెట్టెడు బట్టలున్నా - పోనీ - ఈ వాయిలు చూడండి - బావుందంటారా? ఇదివాళ కత్తిరించి మిషను వేస్తాను-"

నాగమణి చిన్న నవ్వు నవ్వి అంది - "చేతికుట్టే నీ కిష్టమన్నావ్ కదూ?" కాంతం అడ్డంగా తల ఊపి అంది - అప్పుడెప్పుడో అన్నాను - ఇప్పుడు నామనస్సు మారిపోయింది. ఎంత గబగబా ఎంచక్కా కుట్టేయొచ్చు మిషనుమీద! కుట్టు బాగా ఒస్తే మిషను కొంటానంది అమ్మ!"

నాగమణి మంచంమీదనుండి లేచి, కుట్టుమిషను ముందున్న స్టూలుమీద కూర్చొని చేతులు మిషను బల్లమీద ఆన్చింది. కాంతం మిషనుదగ్గరకువెళ్ళి చక్రాన్నొకక్క సారి తిప్పింది, తను ముఝ్ముందు ప్రావీణ్యత సంపాదించబోయేందుకు ఉపకరించే యంత్రం తన స్వంతదిగానూ, తన పిడికిట ఇమిడేటంత చిన్నదిగానూ ఊహించుకుంటూ - నాగమణి నవ్వుముఖంపెట్టి మెల్లిగా అంది-"కాంతం! నీకు చాలా ఆశాభంగం ఇవాళ... నా ఒంట్లో నిన్నరాత్రి నించీ ఏమీ బాగోలేదు - ఇప్పుడూ ఏమీ తగ్గలేదు - ఇవాళ కేమీ అనుకోక్కూ - రేపట్నించి అంతా మామూలే."

ఆ మాటలంటూ, బుజ్జగిస్తున్నట్టు కాంతం భుజాన్ని తట్టింది నాగమణి - నిజంగా ఇది పెద్ద ఆశాభంగమే ఆ అమ్మాయికి -గంతులు వేసే మనస్సుతో వచ్చింది, ఇవాళ కొత్తపని నేర్చుకుందామని. ముఖం వాడింది కొద్దిగా - కాని ఆవిడ చెప్పిన కారణం "ఒక్క పూవుగంటే - ఒక్క పదినిముషాలే నేర్పండమ్మగారూ." అని అన్నా నోట అనిపించింది కాదు - ఇన్నాళ్లయి ఆవిడ ఒక్కనాడన్నా ఒంట్లో బాగు లేదనలేదు - చాలా బాగుండకపోయి ఉండాలి ఆమె ఒంట్లో ఇవాళ ఆమాటలనడానికి - ముఖంలోని నిరుత్సాహాన్ని కప్పిపుచ్చేందుకు ప్రయత్నిస్తూ అంది - "జ్వరంకాని వచ్చిందా అమ్మగారూ?" మనస్సులో బాగులేదంటే ఆ అమ్మాయికేం అర్థమౌతుంది? నాగమణి జవాబుగా అంది - "గుండె బరువుగానూ అదోలా ఉందమ్మ-

"ఇతని వంటిమీద నీవాకొక్క విరగ కొట్టావని ఇతడు ఫిర్యాదుచేస్తున్నాడు. నీ సమాధానం?"

"అది కేవలం ప్రమాదవశాత్తుజరిగింది!"

"నీ వావని బుద్ధిపూర్వకంగా నే చేశావంటున్నాడు అతను?"

"కొట్టటం విషయం కాదండీ నేను మనవిచేస్తున్నది. కర్ర విరిగిపోవటం గురించి"

* * *

"అమ్మగారూ! పని చేయనివి ఏమన్నా ఉంటే మరమ్మత్తు చేస్తాను."

"ఆయన మేడ పైనఉన్నారు వెళ్లు."



## ఆశ

నువ్వలా వెళ్ళినప్పుడు దారిలో వసుసుకి, శశికి చెప్పేస్తావు కదూ?" ఆ అమ్మాయి నెమ్మదిగా తలఊచి, మినుము బల్లమీద నున్న నాగమణి వ్రేళ్ళనుచూస్తూ నిల్చుంది, సాయంత్రంవరకూ ఉందామని వచ్చిన తను [illegible] వెళ్ళిపోలేక - ఇద్దరిమధ్యా కాలంలోని ఒక నిముషం మౌనంగా గడిచిపోయింది. నాగమణి తన ఆలోచనలలో మునిగిపోయింది. కొంతం వ్రేళ్ళతో బల్లమీద లయ వేస్తోంది.

ఏమీ తోచకపోవడంవల్లనో, లేక చెప్పవల్సిన సంగతిలానో జ్ఞాపకం వచ్చినట్టుంది కొంతం-"అన్నట్టు! మొన్ననో ఎప్పుడో-సాయంత్రం - మా ఇంటి ప్రక్కనించి కృష్ణారావు మాష్టారు వెళ్తూ పలకరించేరు నన్ను" - అక్కడ ఆపిందామె - ఆపేరు వినగానే నాగమణి ఉలికిపడింది. రక్తం ఒక్కసారిగా ఆమె ముఖంలోనికి చిమ్ముకొచ్చింది...ఏమిటన్నారో ఇంకా అడుగుదామనుకుంది, కాని వెంటనే సంబాళించుకుని మనస్సు ఆ పేరునుండి మరల్చుకుంది - తనమీద తనకే చీదరింపు కలిగింది. ఆ పేరంటే ఎందుకలా స్థావమిస్తుంది మనస్సు, ఎంత నిగ్రహం చేసుకుందుకి ప్రయత్నించినా? కళ్ళసందులోనుండి వాడిపోయే పూలమధ్యనున్న ఫోటోని చూసిందామె - చిన్న మీసకట్టు - చురుకైన కళ్లు - నొక్కు నొక్కుల జుత్తు - ఎంత ఆకర్షణ ఆ కళ్ళలో! ఆకర్షణనుంచి తప్పించుకోనేందుకు చూపులు మరల్చింది. జంకుతూ అంది కొంతం - "ఏమన్నారో తెల్సా అమ్మగారూ? మీ మాష్టరమ్మ బాగా పాఠాలు నేర్పుతోందా? నేర్చుకో - బాగా నేర్చుకో - బాగుపడడానికి అదే దారి" కొంచం ఊరుకొని అంది కొంతం - "జబ్బుపడ్డారో ఏమో - బాగా నీరసంగా ఉన్నారు - ముఖం బాగా లాగేసింది -"

ఇంకేమీ అనలేదా అమ్మాయి - నాగమణి ముఖంలోని మార్పు లామె కేవీ అర్థం కాలేదు కాని, ఒకటి తెల్సు ఆ పదమూడేళ్ల అమ్మాయికి - కృష్ణారావు గారు అమ్మగారిని పెళ్ళిచేసుకున్నా అవిడంటే పడదని - పది నెలలయి తనిక్కడికొచ్చి నేర్చుకుంటోంది కుట్టు పని - కాని ఒక్కనాడైనా అతనిక్కడికొచ్చినట్టు ఆమెకి గుర్తులేదు. అతను తనతో అన్నమాటలలో ఏదో వ్యంగ్యం స్ఫురించిందామెకి.

నాగమణి ముఖం చిన్నది చేసుకొని ప్రక్కకు తిప్పుకుంది. ఆమె కన్నులు కోపంతో ఎరుపెక్కాయి. దుఃఖం గొంతుకవరకూ వచ్చింది. ఆపిల్లముందు, తన ఆవేశాన్నీ, దుఃఖాన్నీ అపుకోేందుకు తన శక్తినంతా వినియోగించింది. తనస్థితి ఆమె తెలుసుకోకుండా గట్టి ప్రయత్నం చేస్తూ అంది - "సరేకాని - ఎండలో ఒచ్చేవ్ - కాసిని నీళ్లు తాగు -"

"ఒద్దండీ - వెళ్తాను - రేపు, ఈవేళే రమ్మంటారా? ఒంట్లో బావుండకపోతే ఒద్దు." ఆమె అడ్డువస్తూ అంది.

"రేపు తప్పకుండారా! నిన్నవసరంగా కష్టపెట్టేను. వాళ్ళతో చెప్తావ్ కదూ?"

అలానే అన్నట్టు తల ఊపుతూ, వచ్చినప్పటికన్న మెల్లగా అడుగులు వేసుకుంటూ వెళ్లిపోయిందాఅమ్మాయి. ఆ పిల్ల వెళ్ళగానే వెల్లగక్కుదామనుకున్న దుఃఖం వింతగా మాయమైంది నాగమణికి - స్టూలు మీదనుండి లేచి, వెళ్ళి తిరిగి మంచంలో కూలబడి, గోడకు చేరబడిందామె - ఇందాకటి కోపరేఖలుకూడా మాయమయ్యాయి ఆమె ముఖంనుండి. ఆవేశం గుండెలలో తేలి వెళ్లి ఆమె మెదడుకి పని కలిగిస్తోంది. కోపానికీ, దుఃఖానికీ బదులు ఆమె మనస్సేవో వంకర, టింకర దారులలో ఎంతో వేగంగా పరుగులెడుతోంది - ఒక సెకండు ఒక ఆలోచన - దాని ననుసరిస్తూ, దానికనుగుణంగానూ, గొలుసుకట్టుగానూ ఉండక, మరుసెకండు ఇంకేదో ఆలోచన ఆ వరుసని పాడుజేస్తుంది. మొత్తానికి ఆమె భావాలను ఆమె సరిగ్గా అనుసరించలేకపోతోంది. ఫోటోలోని ముఖం ఆ ఆలోచనలలోనుంచి తొంగిచూస్తోందామె గుండెలలోకి; ఆ జుత్తు! ఆ కళ్ళు! ఆ మీసకట్టు! ఏదోఒకటి ఆ మూడింటిలోనూ మనస్సులో ఆ ముఖానికి రూపం దిద్దుతూ.

నాలుగేళ్ల క్రిందట ఈరోజు - ఎందుకనుకోవాలి? ఎందుకు గుర్తుతెచ్చుకోవాలి ఆ రోజు? నాలుగేళ్ళ క్రిందటిది? పోయిన ఘడియలలా గాలిలో కలిసి, కళ్లకు కనుపించకుండా, ఎక్కడికో రెక్కలు కట్టుకపోతాయి, ఊహించనంతటి వేగంగా! పాతస్మృతులు తలపుకు తెచ్చుకుంటే ఉందా ఏమన్నా లాభం? మన లాభనష్టాలతో ప్రమేయం లేకుండా అవి అలా ఒకసారి మనస్సులో కదిలి ఆడి, పోతాయేమో! ఆ ఘడియలలో జరిగిన సంగతులు!

పిచ్చికదూ? ఎందుకు తనివాళ ఆ ఫోటో చుట్టూ హారం వెయ్యాలి? అగరువత్తులు వెలిగించాలి? ఆ ఫోటో అయినా ఎదురుండా.

లీ ఇంట్లో? ఈ ఇంటితో కాని, దాని మనుష్యులతో కాని సంబంధం లేదనుకున్న వ్యక్తిది? ఛీ! తన కేమాత్రం గౌరవం లేదు - తన కేమాత్రం భక్తి లేదు - విశ్వాసం పోయిందేనాడో! తనకూ అందున్న వ్యక్తికీ సంబంధం ఏనాడో తెగిపోయింది - కాని, ఎందుకు వేసింది తను గులాబిదండ ఇవాళ? నాలుగేళ్ళ క్రింద ఈరోజు - ఆ రోజే కదూ తన నీ స్థితికి తెచ్చింది! బ్రతుకులో దిగువ మెట్టుకి! కాని ఒక్క ఏడు - ఒక పూర్తి ఏడాది... సౌఖ్యం - ఎన్ని తియ్యని తలపులు - మల్లెపందిళ్లు - లతలు - వాటిక్రింద సేదదీరుతున్నట్లు - హాయిగా నిద్రపోతున్నట్లు - చల్లటి పానకం తాగుతున్నట్లు! అంత ఆనందానిచ్చే ఆ స్మృతులు! ఆ తియ్యటి అనుభవాలు!

ఛీ! తన కేమీ గౌరవం లేదు! తన కేమీ కాదా బొమ్మ! పేపర్లలో కనబడే అందమైన ముఖాలని చూసినట్లు, ఒక్క నిముషం చూసి, నిరసనగా త్రిప్పేయగలదు తను పుటని - మరి త్రిప్పరాదూ? త్రిప్పి ఏమీ లేకుండా చేసుకోరాదూ? ఆ ఫోటో తీసి విసరేయరాదూ అవతల? అవన్నీ తన కిష్టమే ఆపని తప్పకుండా చేస్తుంది తను సాధ్యమైతే!

నాలుగేళ్ళ క్రిందట ఈ రోజు, ఈ ఊరిలో దిగింది తను, ఆ మనిషితో, మూడువందలమైళ్ళు ఏమీ కానట్టుగా లేచి - ఒక పుష్పకవిమానం మోసుకవచ్చి పడేసింది తన్నిక్కడ - క్రొత్త జీవితం, క్రొత్తపుటలతో మొదలయింది - ఆరోజా కట్టుకుంది తనొక పెద్ద మేడ - లతలతో, పువ్వులతో - మెత్తమెత్తటి పరుపులతో - గొప్పగొప్ప చిత్రాలతో నిండిన మేడ! మేడనిండా ఉండేవి పాలరాతి మెట్లు—.

ఆ కళ్లు, ఆ ముఖం అప్పుడు కంటబడక పోతే ఇప్పటి తన జీవితం ఎలా ఉండి ఉండును? ఇప్పుడు తను ఏ మెట్టుమీద ఉండేది? అది సరి - అలా అనుకోవడం - ఇది మంచికే అని ఎందుకనుకోరాదూ? ఔను ఎందుకనుకోకూడదు?

ఎలా అనుకుంటుంది? ఆమె దృష్టి అనుకోకుండా కుడి చేతిమీది నల్లటి మచ్చమీదికి వెళ్లింది - రక్తం కారి, గాయం మానేక మిగిలినట్లు అది! అలాటి వెన్నో ఒంటినిండా! ఎంత స్వర్గానందం అనుభవించింది తను?!

సంఘం గాని నియమాలు, ఆచారాలు గడ్డిపోచలా త్రోసిం చేయ కళ్లకి ఆరోజుల్లో - ఆ ముఖమే చేయించిం దంతపని! 'ఎంత సరిగా ప్రవర్తించేను' అనుకోగలదా తను? లేదా అటుతరవాత అనుభవించిన ఒక ఏటి ఏడాది సుఖాన్ని తక్కిన రెండేళ్ల యాతనతో తూచగలదా తను?

ఒక కాకి గంతులు వేస్తూ గుమ్మంవరకూ వచ్చి గదిలోనికి తొంగిచూసింది - ఆమె దాని ఆ గమనాన్ని అడ్డుపెట్టేందుకు ఏ ప్రయత్నం చెయ్యకపోగా అది గదిలో కొక్క గంతువేసి వెంటనే తన సాహసానికి తనకే ఆశ్చర్యంవేసి, భయంపుట్టి

#  ఆశ 

ఎగిరిపోయింది, ధైర్యం చిక్కబట్టుకొని మరోకసారి వచ్చేందుకు.

నిద్రపోతున్న పాపమీదకు వెళ్ళేయి నాగమణి కళ్ళు-ఎందు కంత ధైర్యంచేసింది తను? ఎక్కడినుండొచ్చింది తనకా సాహసం! తన వంశం - తన గౌరవం! తన కుటుంబగౌరవం - తల్లిదండ్రులకు కలగబోయే తలవంపు - చెల్లెళ్ళ పెళ్ళిళ్లు - ఈ సమస్యలన్నీ తన బుర్రలో పరుగెత్తకపోలేదు, ఇటువేపు అడుగువేసిన ఆరోజు - కాని అవేవీ అంత పెద్దవిగా తోపించలేదు తనకి - తన కళ్ళ ముందు కదలి ఆడేదా ముఖమే అప్పుడు - వశపరచుకునే కళ్లతో - నొక్కునొక్కుల క్రాపుతో - దానిఆజ్ఞ నెరవేర్చింది తాను.

"నా జాతివేరని గుర్తించుకో - చూడు. మీ కుటుంబ మర్యాద - మీజాతి అహంభావం, ఏవీ నిన్ను ఆటంకపరచటంలేదూ?" అన్నాడాయన ఆరోజు, చిలిపిగా తన కళ్లలోకిచూసి నవ్వుతూ - అప్పుడు తనమనస్సు నిరసనగా నవ్వి, ఆ అభ్యంతరాన్ని అణగద్రొక్కింది - "ప్రపంచపు టంచులవరకూ వెళ్తాను మీతో అవసరముంటే" అనుకుంది తను!

అతనిమాటవరకు క్రొంగిలింగఝపోయింది- ఆ అర్ధరాత్రివేళ తను, తన భావిస్వర్గానికి నాయకుడితో ప్రయాణమయిందీరోజు అతని అభిమాన కుసుమంగా - ఎర్ర గులాబీగా - తరువాత తమ ఇద్దరి బంధుత్వాన్నీ న్యాయబద్ధంచేసింది ఆఫీసు -

నాగమణి కళ్లు మూసుకుంది నీరసంగా - మరి...? ఎర్రగులాబి వాడిపోయిందికదూ? వాడిపోలేదు ... వాడిపోలేదు ... అతని మకుటంనుండి దిగజారిపోయింది...దేముడి పతానికి తగిల్చినపువ్వు క్రింద పడ్డంతమాత్రాన వాడిపోతుందా? ఎర్రగులాబీపువ్వు స్వర్గపుమెట్లమీదుగా స్వర్గాన్ని చేరి, ఒక్కసారిగా మెట్లన్నీ దిగడానికన్నా సమయంలేనిస్థితిలోపడి, నరకంలోకి పడిం దొక్కపెట్టున-..కాని అక్కడి పరిమళం కొంత, స్మృతులు కొన్ని తనతో తెచ్చుకుంది, ఎప్పుడూ తనక్కడ ఆ స్వర్గంలో గడిపిన రోజులు మరపురాకుండా - ఉయ్యాలలోని పాపని మరోకసారి చూసింది నాగమణి అక్కడి పరిమళం! ఈ చిన్న అమాయికపు ముఖమేనా?!!

## 2

దీపంపెట్టి, పాపకి పాలుపట్టి పడుకోపెట్టింది నాగమణి - ఉయ్యాలకి ఒళ్లు తగ్గగానే నిద్రపోయాడు పాప అమాయకంగా ఉన్న ఆ ముఖాన్ని చూడగానే జాలివేసిందామెకి - తలవంచి ముద్దుపెట్టుకుంది ఆ చిన్న లేత పెదవులని -నిద్రపోతున్న పిల్లల్ని ముద్దుపెట్టుకోకూడదంటారని తెల్సు తనకి, కాని తనకాబుద్ధి పుట్టినప్పుడు, అందులో తనకు ఆనందం, తృప్తిఉన్నప్పుడు ఎందుకు మానెయ్యాలా పని - అది తన మతంలో నే లేదు ఆదినుండీ.

వెన్నెల గడపమీద పడుతోంది.

ప్రక్కయింటి నాయుడు తల్లి సోమిదేవమ్మ ఏడేళ్ళక్రిందట పోయిన రెండో కొడుకు కోసం శూనిరాగాలు తీస్తోంది-

దూరంగా బండిమ్రోదు వెన్నెల నమధిస్తూ, జానపదగీతం ఆలాపన చేస్తున్నాడు, సంగీతమంతా తన కొచ్చేసునన్నట్టు, గొంతులో స్వరాలని కలగా పులగంచేస్తూ-

వీధికొసని, క్షయరోగపు భార్యతో కాపురముంటున్న మంగలి పైడయ్య తన సన్నాయిలోనుండి మధుర స్వరాలని ప్రసారం చేస్తున్నాడు

వేడి తగ్గింది - గాలి అంత చల్లగా కాకపోయినా హాయి కలిగిస్తూ వీస్తోంది-

నాగమణి మిషను ముందుకూర్చొని ఆలోచిస్తూ మెల్లగా జాకెట్టు కుడుతోంది - ఆ రాత్రివేళ మిషను శబ్దం పాపాయికి జోలపాటలా ఉంది.

ఏవేవో జ్ఞాపకానికొచ్చి ఆమె గుండె వేగంగా కొట్టుకోసాగింది - "నా ఆనందానికి నేనే రాణిని...అతను రాజు" అనుకున్న ఆరోజు జ్ఞాపకం వచ్చినప్పుడల్లా తన మీద తనకే అసహ్యం కలుగుతుంది - ఎంత చిలిపితనం! ఎంత తెలివితక్కువతనం అలా అనుకోవడం! అయినా అప్పుడలా అనిపించడంలో ఏముంది ఆశ్చర్యం? ఎన్నో చిలిపి ఆలోచనలలో ఇదొకటి - ఆ ఆలోచనలే ఇచ్చేవేమో తృప్తిని!

ఆ సంవత్సరమల్లా ఒక్కనాడన్నా అతనింటికి ఆలస్యంగా వచ్చిన తరుణం ఉందా అని ఆలోచించసాగింది - లేదేమో! ఆఖరికి పిల్లలకి ట్యూషన్లుకూడా చెప్పేవాడుకాదు - తను ఉండాలెప్పుడూ కళ్ళముందు.

నాగమణి ఈ ఆలోచనలకి భంగంకలిగించింది కోపం - అంత జాగ్రత్తగా పహారా ఇస్తున్నా ఎలా ప్రవేశిస్తాయీ ఆలోచనలు

తన బుర్రలో - ఛీ! గతంతో ప్రయాణం చేస్తోందా తను! ఎదురుగా ఉన్న పఠం తీసి విసరేస్తే ఈ ఆలోచనలకి తావుండదు - ఆ పఠంమీద కలిగిందామె కెక్కడలేని ద్వేషం - కాని తనని తాను సంబాళించు కుంది - రెండేళ్ళ శిక్ష అయ్యాక ఆ నర కంలోనుంచి ఒక్కసారి ఇదివరకటి స్వర్గాన్ని అందుకోకపోయినా మధ్యనున్న ఈ లోకంలో ఉంటోంది తను - కాని ఆ పఠంలోని ముఖం దిగజారిపోతోంది పాతాళానికి - నరకానికి! అది తనకి కొంత తృప్తి! మనస్సుకు శాంతి! ఉండనీ ఆ పఠం! ఏం చెయ్యగలదది తనని!

చేతులు అలవాటు చొప్పున ప్రయత్నం లేకుండానే జాకెట్టు ముక్కల్ని కలుపు తున్నాయి. మనసు కుట్టుకపోతోంది - దీపపు చిన్నకాంతిలో కంటిచుట్టూ, అశాంతివల్ల, దుఃఖంవల్ల పడ్డ నల్లటి చక్కలు కానరావటంలేదు - ఆ కాంతిలో ఆమె ముఖం మరింత అందంగా ఉంది.

ఒకసారిగా కుట్టుపని ఆపి, చెవివిచ్చి వింది నాగమణి - దూరంగా ఉన్న ఒక వీధిలోనుండి ఏవేవో కేకలు వినిపించే యామెకు, దేనినో తరుముకొస్తున్నట్టు - చెవొగ్గి వింటోందో లేదో, ఆ గోల, కేకలు దగ్గరయాయి - రానురాను, హోరులాటి గోలపోయి మధ్యమధ్యని మాటలు స్పష్టంగా వినిపించసాగేయి.

"తన్ను! తగల్ను! చితక్కొట్టు! సరసం ఎలా ఉందిప్పుడు! ఇంకోటిచ్చుకో! మరొకటి!"

ఒక్క అరనిముషంలో అది దగ్గరయింది. ఒక మూక పరుగెడుతున్న చప్పుడు. గోల! మూకంతా ఆమె వీధివైపు వస్తు న్నట్టుంది - అనుకోకుండామె తడవుగా, తరాజువ్వలా ఒక వ్యక్తివచ్చి, ఆమె గదిని ప్రవేశించి తలుపు వేసుకున్నాడు. తన కళ్ళను తానే నమ్మలేకపోయింది నాగమణి!

అతను!!!

నాగమణి కొయ్యలా నిలబడిపోయింది లేచాక ఒక్కక్షణం - బైటికేకలు ఆమె చెవినిప్పుడు తగలడంలేదు-

బైటమూక ఇంటిముందు నిల్చొని గోల చేస్తున్నారు కాని ఇంటిగడప ఎక్కడం కాని, తలుపు గుద్దడం కాని, ఏమీ చెయ్య లేదు.

"ఇప్పుడు కావాల్సొచ్చింది పెళ్లాం! ఇన్నాళ్లూ ఏమయిపోయిందీ గురువుగారి కక్కర్లేకపోయింది!" అరుస్తోందొక బొంగురు గొంతు - ఒక కీచుగొంతు అంటోంది - "దుమ్ము లిరగ్గొడతాంరా! బైటికి రా! తాగేసి తందనాలాడితే ఇవత లాళ్లేసంటోయి గాజు లెట్టుకున్నారు?"

"ఏటయింది? ఏటయింది?" ప్రక్కింటి సోమిదేవమ్మ, కంగారుగా బైటకువచ్చి పెద్ద గొంతుతో అడుగుతోం దందర్నీ - మూకలో ఎవడూ ఆమె గొడవ వినలేదు- ఆమె పెద్దకొడుకు ఆఖరికి ఆమె సహాయా నికి వచ్చేడు. "కిష్టారావు మాష్టి(రు)! తాగేసి ఆడాళ్ళని అల్లరెట్టేట్టు! ఓ యబ్బో! ఆడి కెంతపొగరు!" "ఉంచుకున్న గిరి ఏటయి నాది?" ఎవడో, ఎవర్నో ప్రశ్న - "ఈ పెళ్ళామయినాది గిరి అయినాది - ఇప్పు డింకొకర్తి!" "ఓరి రంగా! ఓరి రంగా!" సోమిదేవమ్మ గుండెలు బాదుకుంది, ప్రపంచం ఏమూ ఇంతిలా తగులబడిపోతోం దని -

ఈ గొడవేమీ పడలేదు నాగమణి చెవిని. ఆమె అలానే నిలబడి, ఎదురుగా ఉన్న మనిషిని చూస్తోంది - అతను వేసు కున్న చొక్కా చిరిగిపోయింది. చిరుగుల గుండా కనిపిస్తోంది కర్రదెబ్బలవల్ల తట్లు తేరిన ఒళ్లు - నుదుటినుండి కారుతోంది, రక్తం - గదంతా గుప్పుమంటూ సారా వాసన. గడవేసి, దెబ్బతగిలినచోట తల గట్టిగా నొక్కిపట్టుకొని ఒకసారి వింతగా నాగమణి ముఖంలోనికి చూశాడతను - మాసిన గడ్డాం - అక్కడక్కడ నెరసిన వెంట్రుకలు, తలలో - ఎండిపోయిన శరీరం- ఆ కళ్ళలోనుంచి వచ్చిన చూపులు ద్వేషంతో నిండిఉన్నాయి. ఆ చూపులలోని అర్థం వెంటనే గ్రహించక పోలేదు నాగమణి. అటువంటి చూపులే తనూ అందించిందామనిషికి. కాని, వెంటనే ఎదురుగాఉన్న ఆ మనిషిస్థితి దానిని మార్చేసింది - చిన్న గర్వంతోకూడా ఆమె మనస్సు నిండింది - చూపులు మరల్చు కొని, తోగుతూ వచ్చి, మంచంలో కూల బడ్డాడతడు. మంచంలో కూలబడగానే ఒంటిమీద స్పృహా పూర్తిగా పోయిం దతనికి -

నిల్చున్న తన చోటునుండి కదలలేదు నాగమణి - అతను ప్రవేశించినప్పు డెలా ఉందో, ఇప్పుడూ అలానే ఉంది.

చిరిగిన చొక్కా - తట్లు తేరిన ఒళ్లు! ఒక చిన్న నవ్వు తృప్తిగా ఆమె పెదవులను వది లింది - కాని మరుక్షణమే ముఖం తీవ్రంగా మారిందామెది. అప్పటి తన కర్తవ్యం కూడా మరిచి ఆలోచిస్తోందామె. ఆమె పెదవులు ఆవేశంతో వణుకుతున్నాయి - ఆమె కళ్లు నీళ్ళతో నిండాయి, తనమీద తనకు కలిగిన జాలివల్ల పాప, కడుపులో ఉంటూఉండగా, పెరట్లోఉన్న నూతి నుంచి ఇంట్లోకి, ఒక అరఫర్లాంగుదూరం, జుత్తు పట్టుక ఈడ్చి, గొడ్డును కొట్టినట్టు వెదురుబద్దతో కొట్టినప్పుడు ఆరోజు తన స్థితి! అతని కాళ్ళు పట్టుకుంది - పాదాల మీద తల కొట్టుకుంది - లేనిపోని అను మానాలు తనమీద వద్దంది. ఆఖరికింక బాధ సహించలేక, అనుమానమున్నా పోయె, జాలి తలచి వదలిపెట్టమంది - ఎంతవరకూ ఆనాడు తన మొర, అతని చెవిని పడింది? ఒళ్ళంతా ముద్దయింది రక్తంతో - సరి. ఆ రోజు పూర్తిచేసింది, నరకంలో తన బాధల్ని - మరి అతను గానేదింటికి - వచ్చినా తను తలుపువేసి ఉండును ముఖం మీద - ఇవాళ! తనేస్థితిలో ఆరోజుం డేదో ఆస్థితిలో అతనివాళ! ఒంటినిండా తట్లు - తలమీద గాయం - కళ్లు ఆమెను తెలియ కుండానే మూసుకున్నాయి తృప్తిగా - మరుక్షణమే విడి, తేలికగా చూశాయి మంచంమీద స్మారకం లేకుండా పడిఉన్న ఆ శరీరాన్ని.

ఆమె ముఖంలో ఏమాత్రం ఆతృతా లేదు. ఇప్పుడు తన కర్తవ్యం ఏమిటి? మూలనున్న నీళ్లకుండ, గ్లాసు కనిపించేయి. తన్నారోజు ఆ స్థితిలో వదిలిపెట్టేరు దిక్కూ మొక్కూ లేకుం[illegible]లిక ఎండి పోయినా నీళ్లుపోసేవారు [illegible]ండా - తనిప్పుడతనికి సహాయప[illegible] అది తన ధర్మమా? ఉయ్యాలలోని పాప ముఖం అమాయకంగా కనిపిస్తోంది - బుద్ధుడి విగ్రహం తలపుకొచ్చిందామెకి - ప్రశాంత మైన ముఖం - దయ, కరుణతో నిండిఉన్న కళ్లు - ఆమె కాళ్లు వెళ్ళాయి నీళ్లవైపు - గ్లాసుతో నీళ్లు తీసుకొని మంచాన్ని సమీ పించిందామె - మనస్సులో మాత్రం అను కుంటోంది - ఈపని సరైనది కాదు - తను

---



---

 ## ఆశ 

చెయ్యకూడదు అని - కాని చేస్తోంది - కర్తవ్యమా! కాదేమో! ఏదో ప్రబోధిస్తోంది - గుండెల లోతులలోనుండి-పాప ముఖం - ఇద్దరి కన్నులూ ఒక్కటే - ఎంత ఆకర్షణ వాటిలో!

గాయం చన్నీళ్లతో శుభ్రంచేసి కట్టు కట్టింది నాగమణి - తలవరిగ్గా మంచమ్మీద పెట్టి, ముఖాన నీరుజల్లి తువ్వాలుతో ఒత్తింది - అతని పెదవులు విడి, నోరు తెరచుకుంది, దాహం అన్నట్టుగా - గ్లాసులోని నీళ్లు పట్టిందామె.

వీధిలోని కోలాహలం అంతమయింది - ఎవరిమట్టుకు వారు ఇచ్చిన శిక్ష చేసిన తప్పుకి చాలన్నట్టుగా పోయేరు - బాగా రాత్రయింది - మనుష్యుల అలికిడి ఎక్కడా లేదు - వీధికుక్కలు మాత్రం ఉండుండి అరుస్తున్నాయి, వాటిలో అవి మాట్లాడుకుంటున్నట్టు—

అర్ధరాత్రయింది - నాగమణి కుట్టుపని చేసుకుంటోంది—

అతను మెల్లిగా కళ్లు తెరిచి, చుట్టూ కలియజూశాడు - మెడ ప్రక్కకుతిప్పి, పనిచేసుకుంటున్న ఆమెను చూశాడు - వెంటనే ఏదో గుర్తొచ్చినట్టు లేవబోయాడు- కాని కీళ్లు బాధపెట్టేయి - సగం లేచే స్థితిలో అలానే మంచంమ్మీద ఉండగా నాగమణి చూపులు కలిశాయి. ప్రశ్నార్థకంగా చూస్తోందామె - ఆమె చూపులు కలియగానే మరింత బలం తెచ్చుకుని ఒక్క ఊపున లేచి నిల్చున్నాడతను.

కుట్టుపని ఆపి లేచింది, నాగమణి-అతనిని సమీపిస్తూ అంది - "పడుకోండి!" ఆ మాటలింకా వెలువడనేలేదు, కంచుగంటలా అన్నాడతడు - "పడుకోను!" నాగమణి ఆశ్చర్యపోలేదా జాబుకి - "ఎందుకు?" ఆగొంతుతోనే అంది - "పొరపాటయింది - ఇక్కడికి రావడం -" ఆమాటలంటూ ఉయ్యాలలో నిద్రపోతున్న పాపని చూశాడతను నాగమణి నిరసనగా నవ్వి ప్రక్కకు తప్పుకుంది - కుంటుతూ నడుస్తూ ఉయ్యాలను సమీపించాడతను. ముఖంమ్మీద హేళనగా నవ్వు మెరిసింది. అలాటిగొంతుతోనే అన్నాడు. "నీపిల్లదు?"

బయట వెన్నెలపోయింది - ఇప్పుడంతా చిట్టచీకటి - కీచుపురుగులశబ్దం, పిట్టల కూతలు తప్పిస్తే అంతా నిశ్శబ్దం - కుక్కలు కూడా అరవడంలేదు. కుంటుతూనే గదిని వదిలి వీధిలోకి పోయాడతను, ఆ చీకట్లోనే. చీకటిలో కలిసిపోయే ఆకారాన్ని చూదామని ప్రయత్నించింది నాగమణి లాభం లేకపోగా తలుపు గడవేసి, వెళ్ళి మంచంలో కూలబడింది. "నీ అబ్బాయి"— ఆ ఒక్కమాటా మారుమ్రోగుతోందామెకు చెవులలో. చేతులతో చెవులు నొక్కుకుని కళ్లు మూసుకుందామె.

### 3

"క్రిష్టారావు మాష్టరు పోయేడుట!"

"హా! పోయేడూ? అనుకుంటూనే ఉన్నాను. ఆ తాగుడూ అదీ చూస్తే—?"

"కృష్టారావు మాష్టరు పోయేడు!"

ఒక్క సెకండు మౌనం—

"పీడ వదిలింది! పెళ్లాన్ని నానా బాధలూ పెట్టేవాట్ట కదూ అనుమానాలు కట్టి - తాగుబోతు వెధవ!"

"ఈ సంగతి తెల్సునా? కృష్టారావు పోయేడుట!"

"పోనీ ఊళ్లో అల్లరి, అలికిడి కొంత తగ్గుతుంది."

"కృష్టారావుగారి నాశ పోయేరు మాష్టారూ!"

"ఆ! నిజమే? మీరు వెళ్తున్నారా? అయినా చూడండీ ఈ ట్యూషన్లూ అవీనూ నాకు - ఊపిరి ఆడడం లేదు - అన్నట్టు నా కోసల్లుడుకి వెంటనే టెలిగ్రాం ఇవ్వాలి రమ్మని - క్రిందటిసారి ఒక ఖాళీ వచ్చినప్పుడే అవవల్సింది ఉద్యోగం - ట్రెయినింగు తరవాత చూసుకో ఒచ్చు!"

ప్రాణంలేని భర్త ప్రక్క' గుమ్మ దండెమీద కూర్చుంది నాగమణి—

బండినాయుడు నరసయ్య అప్పుడే బయటకు వెళ్లాడు తరువాయి ఏర్పాట్లన్నీ చెయ్యడానికి—

వీధిలోని వారంతా ఉదయమే వచ్చి జాలిచూపించి ఓదార్చి వెళ్లేరు

ముసలి సోమిదేవమ్మ వచ్చింది - జాలి చూపించి, ఓదారుస్తూ, ఎప్పుడో పోయిన కొడుకుకోసం కూనిరాగా లొక పావుగంట తీసి వెళ్ళింది - పనిమనిషి అప్పికూడా వచ్చి వెళ్ళింది - పాపం దానికి పని ఒత్తిడి - లేకపోతే అంతా అయ్యేవరకూ తనూ ఉండును - మంగలి పైడయ్యా ఒచ్చేడు - విచారాన్నభినయిస్తున్నట్టు ముఖం పెట్టి బైటకువెళ్ళి, తన అభిప్రాయం ఎవరికీ అక్కరలేకపోయినా వెలిబుచ్చాడు - "మా గొప్పిల్లాలు - లేకపోతే ఎన్ని కష్టాలెట్టేడు! ఎన్ని బాద లెట్టేడు! రెండి రోజులు తిండినేకుండా అతగాడి సేవజేసినాది" గౌరినాయుడొచ్చేడు - చాకలి బోడిగాడొచ్చేడు - అమ్మ నొచ్చింది - వీధిలోనివాళ్లు వీధిలోనివాళ్లకి కాకపోతే మరెవ్వరు చేస్తారు సాయం! ఫరవాలేదు - తెంగఒగ్గు - జరగవల్సిందంతా తము చూసుకుంటారు - నూక్కలుమాష్టర్లా? వాళ్లురారు!

ఒక్క మాష్టరుమాత్రం ఒచ్చేడు - సాంబమూర్తి - అతనికీ తాగుడు అలవాటుండేదని వదంతి - స్నేహితుణ్ణొకసారి చూశాక కాఫీతాగి ఒస్తానని వెళ్లిపోయేడతను.

ఉయ్యాలలోని పాప వ్రేలాడుతున్న లక్కకాయని చూస్తూ కేరింతాలు కొడుతున్నాడు. వస్తూవస్తూఉన్న ముందరి రెండుపళ్లూ, సుద్దరాళ్లలా ఉన్నాయి.

నాగమణి ముఖాన కన్నీరు కారినట్టు చార లెక్కడా లేవు - కాని ముఖం వాడిపోయింది, రెండురాత్రులు నిద్రలేక-రెండు రోజులక్రింద తెలివిలేకుండాఉన్న అతన్ని తెచ్చి పడేశారు - అప్పట్నించీ డాక్టరు-మందులు - పరిచర్య.

ఆమె మనస్సులో ఇప్పుడు ఎవ్వరిమీదా కోపంలేదు - ద్వేషంలేదు - ఒకటే ఆలోచిస్తోందామె - చురుకైన ఆ కన్నులు మూసుకపోయేయి - మరి విడవు - మరి తన కోపం, ద్వేషం ఎందుకు? ఎవరిమీద? ఆ రోజు రాత్రి! మూడు నెలల క్రిందట-అతను లేచి, తంటుకుంటూ చీకట్లో కల్సిపోయేరు- ఎందు కడ్డుపడిందికాదు తను? వెళ్లవద్దని? కాళ్లమీదపడి ప్రాధేయపడలే దెందుకు? అహంభావమా? కసా? కోపమా? కాకపోతే, ఆ స్థితిలో మనిషిని తనెందుకు వదిలేయాలి? అప్పుడు తను చేసిన పని సరైనా దేనా అని అనుమానం కలిగింది నాగమణికి-కాని అప్పటి పరిస్థితి వేరేమో - అప్పుడా శరీరానికి ఒక మనస్సుండేది - మెదడుండేది - మాట్లాడేందుకు నోరుండేది - "నీ పిల్లడు!" ఏం మాట! ఎవరి పిల్లడు? అతని బిడ్డమాత్రం కాదూ పాప! అతను మనిషేనా ఆమాట లనడానికి?—కాని ఇప్పటి స్థితి వేరు - ఈ శరీరంలో ఇప్పుడు జీవం లేదు - తను కోపం చూపినా, జాలి చూపినా, ప్రేమచూపినా అందుకోనేందుకు, తిరిగి జవాబివ్వడానికి ఆ బొందెలోని మనిషి రెక్కలొచ్చి గాలిలోకి ఎగిరిపోయేడు - ఇప్పుడింక తనకులేదు నరకం కాని, స్వర్గంకాని - తన ఊపిరిఉండగా ఈ ప్రపంచంనుంచి తన్నెవ్వరూ అక్కడికి పంపలేరు!

వరసయ్యా, గవిరినాయుడూ కల్సి కట్టె పూర్తిచేశారు చడీ చప్పుడూ లేకుండా - స్కూలుమాష్టరు సాంబమూర్తి, చాకలి బోడిగాడు, సోమిదేవమ్మ పెద్దకొడుకూ బైట కూర్చొని రాజకీయాలు చర్చిస్తున్నారు ఈలోగా - సాంబమూర్తికి మనిషి ఎచ్చుతక్కువలుగూర్చి ప్రమేయం లేదు - రాజకీయాలే కాదు, ప్రపంచంలో మనిషికి సంబంధించిన సమస్యలన్నీ చర్చిస్తాడు పని మనిషి అప్పితోనన్నా సరే దానికీ సంభాషణ ఇష్టంఉండాలికాని - ప్రస్తుతం 'ఆటమిక్ థియరీ' బోధపరుస్తున్నాడు బోడిగాడికి.

కప్పిఉన్న దుప్పటి తొలగించి ఒకసారి ముఖం చూడాలన్న కోరిక కలిగింది నాగమణికి - అనుకున్నది, ఆచరణలో పెట్టింది వెంటనే - నుదుట ఆనాడు తగిలిన దెబ్బ మచ్చకట్టింది, నల్లగా - నిద్రపోతున్నప్పుడుండే పాప కళ్ళలాఉన్నా యతనికళ్లు - ఎంత నీరసంగా, అమాయకంగా ఉంది ముఖం! ఈముఖంమండేనా తనువింది హాయినిచ్చేమాటలు? ఆ పెదవులేనా తన్ను తీసుకవెళ్లేయి స్వర్గానికి! మూసుకున్న ఆ కన్నులేనా వశపరచుకున్నాయితన్ను! స్వర్గాన్ని చూపించిన అకళ్లే, ఆ పెదవులే ఆముఖమే తిరిగి తీసుకపోయింది నరకానికి తన్ను - ఆ గుండెలో ఇదివరకు దాగుండే మనిషేనా చేయించే డీపనులన్నీ ఏమీ తెలియని దేహం చేత? కోరికలు, ఊహాలు, కోపం, అసూయ, అనుమానం, ద్వేషం, క్రూరత్వం, ఈ అనుభూతులన్నీ ఆ ఒక్క ఒంటిలోనే కలిగాయా?

ఆలోచనల నక్కడ కాపింది, నాగమణి. దుప్పటి తిరిగి ముఖంమ్మీద కప్పాలనిపించలేదామెకి. గౌరినాయుడు, వరసయ్యా, సాంబమూర్తిగదిలో కొచ్చారు - నాగమణి లేచి నిల్చుంది - కొద్దిగా ఆగమని చెప్దామనుకుంది. కాని మాటలు రాలే దామె నోటి నుంచి -

ముగ్గురూకల్సి సాయంపట్టా రాదేహాన్ని. నాగమణి తలుపుచాటున ఉండి జరిగేది చూస్తోంది - కట్టెలేచి, నలుగురి భుజాల మీదా తేలుతూ యానం సాగించింది, "నారాయణ" శబ్దం మధ్య -

నాగమణి చూసింది ఆఖరుసారిగా, అంతిమయానం చేస్తున్న తన దేహపు సగపాలుని - ఒక పాత్ర నాటకరంగంనుంచి పోతోంది - ఒకఆశ్వాసం అంతమయింది - కట్టె మలుపు తిరిగి మరి కనుపించలేదు.

నాగమణి మనస్సులో మెరిసింది ఇప్పటివరకూ మరుగుపడ్డ ఒక నిజం. తను ప్రాణంగా ప్రేమిస్తోం దతనిని!! కాని నిందని ఆ ఆకర్షణీయమైన కళ్లమీదవేస్తూ-అతను కొట్టినా, తిట్టినా, అవమానపరచినా ఓర్చింది - ఎందుకని? ఆ రాత్రి ఇష్టం లేదనుకుంటూ అతనికి పరిచర్య చేసింది-పడుకొని విశ్రాంతి తీసుకోమంది - ఎందుకు చేసిం దివన్నీ - తిరిగి స్వర్గసీమని చవిచూద్దామన్న ఆశతోనా? ఇప్పుడు తిరిగి రారు మరి అతను — ఎవరికోసం నిరీక్షిస్తుందింక? దేనికోసం ఇంక ఆశ!

ఈ నిజం మనస్సులో మెరియగానే ఆమె కళ్లనుండి నీరు కాలువలుకట్టి కారడం ప్రారంభించింది - అతను మరి రారు! మరి రారు!! కళ్ళు కప్పుకొని వెక్కి వెక్కి ఏడుస్తూ గదిమూలకు వెళ్లి నేలమీద పడి ముఖం చేతులలో దాచుకుంది. ఆ ఆశ పెట్టుకునే ఉందిన్నాళ్ళూ! మరి దేనికోసం ఆశ! మరి ఏ ఆశా లేదు - తల నేలకేసి కొట్టుకుందామె గట్టిగా - ఎందుకని మిగిలిన బ్రతుకని మొయ్యాలి తను?

కెవ్వుమని ఏడ్చిన పాప నాగమణి నీ ప్రపంచంలోకి తెచ్చాడు. పాప ఉన్న సంగతి నాగమణికి గుర్తొచ్చింది వెంటనే-

ఉదయంనుండి పాలివ్వలేదని కూడా గుర్తొచ్చింది! దిగ్గున లేచి, మరలా ఆమె పాలు కలిపి, బుడ్డీనింపి, పాప నోటి కందించింది-

అంతరించిన ఏదోఆశ మొలకెత్తిందామె మనస్సులో ఆమెకు తెలియకుండానే - ఆ చురుకైన కళ్ళు తనని వశపరచుకుంటున్నాయి - ఉండమంటున్నాయి - ఆ బోసినోటి నవ్వు ఏదో ఆశని తనకిస్తోంది - మళ్లా ఒక ఆశ! కాని దీని గడువు చాలాకాలం.

## 4

చిన్నదీపపు కాంతిలో మినుకుమినుకుమంటూ కుట్టుకో పోతోందా పూరింటిలో, కాలాన్ని దొర్లిస్తూ - సున్నితమైన రెండు వ్రేళ్లు ఆ మసక వెలుగులో కత్తిరించిన ముక్కల్ని కలుపుతూ కుడుత . . . చక్రాల లాంటి కన్నులు చూ . . . తయారైన దుస్తునైపు - ఒక మనస్సు . . . లంతోపాటు దొర్లుతూ దేనికోసమో ఆశపడుతోందా ఇంటిలో!






# పాశ్చాత్య నాగరికతా వ్యామోహం!



**కొమ్మూరి ఉషారాణి**

ఒక సందర్భంలో ఒకరు తన సోదరికి వ్రాసిన ఉత్తరంలోని సారాంశమిది.

"కాయితం కలం తీసుకుని పట్టుమని పది పంక్తులు ఉత్తరం వ్రాయటమైనా చేతకాని నాకు ఈమధ్య నా అనుభవాలనే ఒక పుస్తకంగా వ్రాయాలనే ఊహ కలిగింది. నా జీవితంలో చేసుకున్న మార్పులూ, తత్ఫలితంగా కలిగిన అనుభవాలే ఇందుకు కారణాలు.

"నా భార్య ఇప్పటికి అయిదేళ్ళనుంచీ ఉద్యోగం చేస్తోంది. ఆ ఉద్యోగం కేవలం డబ్బు సంపాయించటమే గాక, నా కుటుంబానికి అఖండమైన కీర్తి హోదా తెచ్చి పెడుతోంది. 'ఫలానా ఆమె ఈయన భార్య' అని అందరూ నన్ను గురించి చెప్పుకుంటున్నారు. ఆమె ఉద్యోగం చెయ్యడం నాకు పరువు తక్కువగా లేదు. పరులతో ఆమె మాట్లాడితే నాకు ఈర్ష్య కలగదు. అంతో యింతో చదువుకుని సంస్కారమున్న కుటుంబంలో పెరిగినవాణ్ణయినప్పటికీ, ఎందుచేతనో ఆమెతో సరిగ్గా జీవించలేకుండా వున్నాను. ఆమె ప్రతిభా, కీర్తి, పలుకుబడీ నన్ను వెంటాడుతూ ఈర్ష్యా ద్వేషాలతో వేధించకపోయినా, ఎందుకో నాకు శాంతి మాత్రం లేకుండా పోతోంది. ఇంతకంటె సామాన్యంగా వుండి, నా అవసరాలు కనుక్కుంటూ చర్చలలోకి దిగకుండా నే చెప్పే విషయాలు శ్రద్ధగా వింటూ, నేను ఆఫీసునుంచి ఇంటికిరాగానే వివియ్యంచాటో పట్టుకుని ప్రత్యక్షమయ్యే యువతితో అయితే ఎక్కువ సుఖపడేవాడినేమో అని అనిపిస్తూవుంటుంది. ఇంతేకాదు తత్ఫలంగా స్త్రీ పురుషుల మధ్య వుండే తారతమ్యాలు ఇప్పుడు కాదని తోసిపుచ్చి స్త్రీలు పురుషులతోబాటు సమాన ప్రతిపత్తి కోరుకోవటం అంత సమంజసం కాదనిపిస్తోంది. కేవలం పాశ్చాత్య నాగరికతా ప్రభావంవల్లే మన సాంప్రదాయలని విమర్శించటం సంఘంలో మార్పులు తేవాలని ప్రయత్నించటం జరుగుతోందనీ, ఆచరణలో అవి అంతగా ఫలించవనీ నా అభిప్రాయం..."

ఆ ఉత్తరానికి అతని సోదరి సమాధానం ఈ క్రిందివిధంగా ఉండటం సముంజసం అనుకుంటాను:

"నువ్వు పుస్తకం వ్రాయటమనేది ఎంతో సంతోషించతగ్గ విషయమే. కానీ నీ జీవితంలో చేసుకున్న మార్పులు నీకు సరైన దృక్పథాన్ని అలవరిచినట్లు తోచదు. నీ భార్య ఉద్యోగం చెయ్యటం నీకు పరువు తక్కువకాదనీ, ఈర్ష్య జనించటం లేదనీ నువ్వు అనుకుంటున్నావు కాని అవి అజ్ఞాతంగా నీ మనస్సుని బాధిస్తూనే వున్నాయనుకుంటాను. నీ భార్య తన కాలాన్నీ ఆలోచనలనీ, జీవితాన్నీ పూర్తిగా నీ సుఖంకోసమే వెచ్చించటం లేదని నువ్వు బాధపడుతున్నట్లు నీ ఉత్తరమే స్పష్టంగా చెబుతోంది. నీ భార్య ఎల్లప్పుడూ నీముందు కూర్చుని, చర్చలలోకి దిగకుండా కిక్కురుమనకుండా నీమాటలు వింటూ వియ్యంచేట చేతబట్టుకు కూచోవాలని కోరుకోవటంలోనే నువ్వు నీకు వుందనుకుంటున్న ఆ సంస్కారం నాకు కనిపించడంలేదు.

"మీరు మీ సహజశక్తులూ ప్రతిభా ప్రకాశించేందుకు అవకాశమిచ్చే పరిస్థితులు కావాలని కోరుకుంటారా?' అని ప్రశ్నిస్తే ఎంతమంది స్త్రీలు స్పష్టమైన సమాధాన



మిస్తారో, ఎందరు కేవలం సంసార జీవితాన్నిమాత్రమే కోరుకుంటారో చెప్పటం కష్టం. ఉద్యోగానికీ దాంపత్య జీవితానికీ పొసగకపోతే ఉద్యోగానికి తక్షణమే రాజీనామా యిచ్చేస్తారు. బయట ప్రపంచంలో అడుగడుగునా ఎదురయే ప్రతికూల వాతావరణాన్ని, సమాజం మోపే నిష్ఠురాలనీ అధిగమించి ముందుకి పోయేవారు ఎక్కడో వుంటారు. ఆ స్త్రీలకి యింట్లో వాతావరణం సుముఖంగా అనుకూలంగా వుండక పోవచ్చు. భర్త రెండు మూడుసార్లు విసుక్కున్నా, అసంతృప్తి ప్రకటించినా వుద్యోగం మానేస్తారు. అంతటితో వారిలో వుండే సహజప్రతిభా, ఆసక్తీ క్షీణిస్తాయి. భావిలో రాగలిగే సదవకాశాలు అడుగంటిపోతాయి అలా అజ్ఞాతంగా ఎందరు స్త్రీలు చరిత్రలో అజ్ఞాతంగా మణిగిపోయారు! ఇంకా ఎందరు స్త్రీలు ముందుకు రాలేక పోతున్నారో!

"మన పూర్వచరిత్రను ఒక్కసారి తిరగవేస్తే, స్త్రీలలో కూడా రాజకీయరంగంలో ప్రతిభావంతులు, యుద్ధరంగంలో పరాక్రమం చూపిన వారు, సాంఘిక ఉద్యమాల్లో పాల్గొన్న వారు, సాహిత్యంలో ప్రకాశించిన వారు ఉన్నట్లు స్ఫుటమవుతుంది. వేదకాలంలో గార్గేయి, లోపాముద్ర, జయంతి మొదలైన రచయిత్రులు వెలిశారు. 17, 18 వ శతాబ్దాలలో ఝాన్సీలక్ష్మీబాయి, తారాబాయి మొదలైన మగాఠీస్త్రీలు రాజకీయాల్లో పాల్గొన్నారు. ఆపత్కాలంలో స్త్రీలు తమ యిళ్ళను రక్షించుకునేవారనీ, చాళుక్య రాజుల పరిపాలనా కాలంలో రాజ్యాంగంలో పాల్గొన్నారనీ తెలుస్తుంది. ప్రాచీనకాలంలో స్త్రీలు విద్య నభ్యసించేవారు. 15, 16 సంవత్సరాలవరకూ వివాహాలు చేసుకునేవారు కాదు. తల్లితండ్రులు వారికి అనేక వృత్తులలో శిక్షణ యిచ్చేవారు సాహిత్య ప్రపంచంలో మొల్లవంటి వనితలూ వెలిశారు. కానీ ఆ చరిత్రే ఆధారంగా తీసుకుంటే పురుషులు కనబరచినంత ప్రతిభను మేధాశక్తినీ ఆట్టేసుంది స్త్రీలు కనబరచలేకపోయారనే విషయం తెలుస్తుంది స్త్రీలు ఒక్క శాస్త్రానికికూడా కర్తలు కాలేకపోయారు. సకల శాస్త్రాలకూ పురుషులే కర్తలు. దీనికి కారణం ఏమిటి?

"భర్తకిచేసే సేవవల్లనే స్త్రీకి స్వర్గంలో పెద్ద అంతస్తు లభిస్తుందన్నాడు మనువు. భర్త మాట అనుసరించటమే స్త్రీ యొక్క ముఖ్యవిధి అన్నాడు వశిష్ఠుడు. భర్తకంటె స్త్రీకి వేరే ప్రపంచమే లేదన్నాడు యాజ్ఞవల్క్యుడు. కాళిదాసంతటి మహాకవి స్త్రీ పురుషుని ఆనందంకోసం సృష్టించబడినదన్నాడు. స్త్రీకి అంతకుమించిన స్థానం యివ్వలేకపోయారు. 'ఆ మాటలన్నీ నిజంకావు. కొందరు పురుషులుమాత్రం స్వలాభంకోసం స్త్రీలను అణగద్రొక్కడానికి పలికిన వాక్యాలని' అని కొందరు అంటారు.

"అసలు స్త్రీ జన్మే దుఃఖకారణం; బాల్యంలోనే వివాహం పూర్తయి, భర్త మరణానంతరం సహగమనంచేసి స్వర్గలోకం చేరుకోవాలి' అన్నారు కొందరు. స్త్రీలను బానిసలుగా వుంచడానికి పురు





# పాశ్చాత్యనాగరికతా వ్యామోహం!

షులు కొందరు ఈ ఆచారాలనీ శాస్త్రాలనీ సృష్టించారనే అభిప్రాయం వుంది. సమాజంలో ప్రబలంగా ప్రచారంలో వుండి, పలుగురూ నిజమని నమ్మి గౌరవించినంత కాలం ఇటువంటివే ప్రజల జీవితాన్ని తీర్చి దిద్దుతూ వుంటాయి. ఇటీవల, (అంటే 1936 వ సం॥ లో) భర్త భార్యని దెబ్బలతో దండించటం న్యాయసమ్మతమే నని మద్రాసు హైకోర్టులో ఒక సెషన్సు జడ్జి తీర్పు ఇచ్చారు.

"ఇంగ్లాండు, రష్యా జర్మనీ మొదలైన ఏ పాశ్చాత్య దేశచరిత్రను పరిశీలించినా వారి సామాజిక జీవితవిధానాన్ని బట్టీ, సంస్కృతినిబట్టీ, స్త్రీల పరిస్థితి ఆ సమాజంలో అంతంతమాత్రంగానే వుండేదని తెలుస్తుంది. 1850 వ సం॥ వరకూ ఇంగ్లాండులో స్త్రీలు ఒంటరిగా షికారుకి పోవటానికిగానీ, రైలుప్రయాణం చెయ్యటానికిగానీ అవకాశముండేదికాదు. 1888 వ సం॥ వరకూ అక్కడ స్త్రీలకు వైద్యవృత్తిలో శిక్షణ యివ్వడానికి నిరాకరించేవారు. 1840 వ సం॥ లో జరిగిన బానిస వ్యతిరేక మహాసభలో అమెరికన్ స్త్రీ ప్రతినిధులకు తావులేకపోయింది. కేంబ్రిడ్జి యూనివర్సిటీ మొన్న మొన్నటివరకూ స్త్రీలకు డిగ్రీలు ఇవ్వడానికి నిరాకరించింది. మనదేశంలో మహమ్మదీయులు అవలంబించిన పరదాపద్ధతిని పూర్వం రష్యా, సిరియా గ్రీస్ దేశపు స్త్రీలు అవలంబించేవారు.

"రష్యాలో ఒకప్పుడు వివాహసమయంలో వధువుతండ్రి వరుడికి ఒక బెత్తము గూడా బహూకరించేవాడట! జర్మనీలో వాడుకలో ఉన్న ఒక సామెతనుబట్టి 15 వ శతాబ్దంలో పురుషులు స్త్రీలను అమానుషంగా శిక్షించేవారని తెలుస్తుంది. ఛాసర్ రచనలనుబట్టి పశ్చిమ దేశాలలో ఈ అలవాటు సర్వసాధారణమైనదని స్ఫుటమవుతుంది. ఇగ్లాండు, ప్రాచీన రోమ్‌లలో గూడా బాల్యవివాహాలు ప్ర[illegible]ంగా వుండేవి. మిల్టనంతటి మహా[illegible] మారుమాటాడకుండా పురుషుల[illegible]రిం చాలన్నాడు. సోక్రటీసంతటి మేధావి సమస్త పాపాలకీ స్త్రీయే కారణమనే అమూల్య అభిప్రాయాన్ని వెల్లడించాడు! స్త్రీ పాపహేతువని క్రైస్తవులకు సెంట్ పాల్ బోధించాడు. వీటినిబట్టి కేవలం మన ఒక్క దేశంలోనే గాక విదేశాలలో గూడా స్త్రీలకు సమానహక్కులు ఎన్నడూ లేవనీ, వారిని అక్కడ కూడా అణగ ద్రొక్కి వారి మనోవికాసాని కెటువంటి అవకాశమూ లేకుండా చేశారనే విషయం ఋజువవుతుంది. నేటికీ బ్రిటన్, ఫ్రాన్సు, అమెరికా మొదలైన దేశాలలో స్త్రీలకు పురుషులతో సమాన ప్రతిపత్తి లేనేలేదు.

"కాలంమార్పు చెంది, సమాజ జీవిత విధానంలో కొద్ది మార్పులు తేబడి, ముందుకి పురోగమిస్తున్నా, స్త్రీలు పురుషుల మాదిరిగా ప్రకాశించలేకపోతున్నారు. మనదేశంలో మార్పులనేకం జరిగాయి. ఇంకా జరుగుతున్నాయి. కానీ కొందరు వివృత్తిలో గానీ సహజంగా ప్రకాశించలేకపోతున్నారు. పురుషుల కలవడినంత లౌకి





జ్ఞానమూ ఆలోచనాశక్తీ స్త్రీలు అలవరచుకోలేకుండా వున్నారు 'జన్మఫలంగా స్త్రీ పురుషుల మధ్య వుండే తారతమ్యమూ, దైవికంగా స్త్రీలకు అబ్బిన అలవాట్లూ, మనఃప్రవృత్తీ ఆమె బలహీనతకు కారణం' అనే వాదనను శారీరక మానసిక శాస్త్రవేత్తలు కొందరు లేవదీశారు. మానవ సమాజం అన్ని విధాలా అభివృద్ధిపొందిన ఈరోజుల్లో ఈ రకం వాదనలను అంగీకరించటం కష్టం. ఆ కారణాలే స్త్రీల బుద్ధికుశలతకీ లౌకికజ్ఞానానికీ అడ్డుతగిలేవయితే, ప్రాచీనకాలంలో మనదేశంలో స్త్రీ రాజకీయవేత్తలూ, రచయిత్రులూ కొందరు వెలిసి కీర్తి గడించడానికి కారణం ఏమయి వుంటుందనే అనుమానం సహజంగా కలుగుతుంది.

"ఈ ఆధునిక యుగంలోగూడా స్త్రీల ప్రవర్తనని సరిదిద్దేసూత్రాలూ, పరిమితులూ బయలుదేరుతూనే వున్నాయి. సాంఘిక పరిస్థితులతో సంబంధం లేకుండానే, పురుషులు మసలేవాతావరణాన్ని స్త్రీలు కల్పించుకోలేకుండా వున్నారు. దీనికి కొంతవరకూ సామాజిక జీవితవిధానమూ ప్రతికూల వాతావరణమూ కారణం అనిపిస్తుంది.

"మానసికవికాసం పొందటానికి సామాజిక జీవితంలో పాల్గొనటం ఎంతో అవసరం. మానవులందరూ సంఘజీవులే. సంఘంలో పదిమందితో కలవటం, సంబంధ బాంధవ్యాలు ఏర్పరుచుకోవటమనేది వ్యక్తి వికాసానికి పునాదివంటిది. కానీ మనసమాజంలో స్త్రీని ఎంతఘోషాలో పెడితే నైతికంగా అంత బాగుపడుతుందనీ, స్వాతంత్ర్యాన్ని ఎంతఅణచివేస్తే సంసారంలో అంత శాంతిసౌఖ్యాలు లభిస్తాయనీ, వివాహం చేసుకుని బిడ్డలను చూచుకోవటానికే తప్ప ఆమె మరి దేనికీ పనికిరాదనీ ఇటువంటి భావాలు ఇంకా నశించలేదు. ఈనాడు విజ్ఞానవికాసాలులేని స్త్రీ పురుషులవల్లనే సంసారాలలో శాంతిసౌఖ్యాలు అడుగంటుతున్నాయని ఇంకా గ్రహింపుకి రావటం లేదు. తత్ఫలితంగా అడుగడుగునా స్త్రీలకు ప్రతికూలపరిస్థితులు ఏర్పడుతున్నాయి

"ఈ వాతావరణం మారాలి అనే అభిప్రాయాన్ని అపార్థం చేసుకుని, స్త్రీలు 'స్వేచ్ఛ'కోసం ప్రాకులాడుతున్నారనీ, పురుషులతో పోటీ పడుతున్నారనీ, పాశ్చాత్య నాగరికతా వ్యామోహం ప్రబలిందనీ ఈవిధంగా అపోహపడ నవసరం లేదు. స్త్రీలకు పూర్తిహక్కులు విదేశాలలో గూడా యింకా లభించలేదు. ఆదర్శ స్త్రీని సృష్టించుదామని కొత్త ప్రయత్నాలు చేస్తున్న రష్యాలోగూడా స్త్రీలకు అన్ని రకాలైన వృత్తులలో అవకాశంలేదు. క్షణక్షణానికీ మార్పుచెందుతున్న మన ఆర్థిక రాజకీయ సామాజిక జీవితాన్ని సమన్వయించుకోవటంకోసరం, సమాజంలో కొన్ని ముఖ్యమైన మార్పులను తేవాలనే భావం పాశ్చాత్య నాగరికతా వ్యామోహ మెన్నటికీ కాదు..." ★

## వనితాలోకం సీరియల్




# 20

బాసులీ గ్రామం - అందంగా - భాగ్యవంతంగా ఉండే ఇతర నగరాల లాగానే అన్ని విషయాల్లోనూ సౌష్ఠవంగానే ఉన్నా - ఏదైనా ఒక నది ఒడ్డునే ఉండే అదృష్టంమాత్రం ఆ ఊరికి పట్టలేదు. అయితే ఆ గ్రామస్థులకు ఒక తృప్తిమాత్రం ఉంది. ఆ ఊరికి ఏడెనిమిది ఊళ్ళ కవతలగా సరస్వతీనది ఉంది. ఆ నది ప్రకృతీ, ప్రభావంకూడా ఈ ప్రాంతపు జమీందారుగారి ప్రభావంలాగా తీవ్రమైనది. పైగా ప్రక్కనే నదిలేదన్న కొరత తీర్చటానికి బాసులీ జమీందారులు ఎంతో డబ్బు ఖర్చు పెట్టి - ఈ నదికి ఒక కాలువను త్రవ్వించి దాన్ని బాసులీమీదుగా వారి యొస్టేట్ పరిహద్దులో ఉన్న మరొక నదిలో కలిపారు. దానికితోడు ఆ నది ముఖద్వారం చెంత చాలా పెదభవనం ఒకటి కట్టించి, దాని చుట్టూ తోటవేయించి, దానికి 'బాసులీ - ఉద్యానభవనం' అని పేరు పెట్టారు.

బాసులీకి ఇంచుమించు పదిహేను మైళ్ళ దూరంలో సరస్వతీనది ఒడ్డునే ఉంది ఈ ఉద్యానభవనం. వర్షాకాలంలో, నది వరదలకు ఒడ్డు కోసుకుపోకుండా ఈ భవనం పొడుగునా కోటగోడలాంటి గోడను నిర్మించారు. ఈ ఉద్యాన భవనానికి ఇదొక విశిష్టత. రకరకాల అపురూప వృక్షలతాదులతో, విశాలమైన పెద్దభవనంలోని వైభవోపేతమైన అలంకరణలతో ఆ ఉద్యానవనం ఎంత శోభాయమానంగా ఉంటుందో ఊహించుకోవాల్సిందే!

కాని సంవత్సరంలో చాలా రోజులు, ఈ భవనం, చక్కగా అలంకరింపబడిఉండే అందులోని గదులూ ఊరికేనే పడి ఉంటాయి. ఒకొక్క సంవత్సరం గ్రీష్మకాలంలో మాత్రం జమీందారుగారు సపరివారంగా వచ్చి ఈ భవనంలో కొన్ని వారాలపాటు ఉంటూ ఉంటారు. ఆ సమయంలో ఈ ప్రాంతం మరి కళకళలాడుతూ ఉంటుంది. ఇక్కడ ఉండే అనుచరులూ మొదలైనవాళ్ళూ - వాళ్ళ జమీందారు మరి కొన్నాళ్ళుంటే బావుండునే అని కోరుకుంటూ ఉంటారు. కాని ప్రతియేటా రావటానికి వారికి అవకాశం ఉండదు. అలాగే ఈయేడు రానేలేదు.

కాని కొన్ని సంవత్సరాలనుంచి ఇంచుమించు ప్రతి ఋతువుకీ చిన్న జమీందారుగారు వచ్చి స్థిరంగా ఉండకపోయినా తన అనుచరులతో ఒకటిరెండు రోజులుండి గడిపిపోతూ ఉండటం పరిపాటయింది నిజమే కాని అందువల్ల ఈ ప్రాంతీయులు ఏమీ ఉత్సాహపడరు. ఎంచేతంటే పెద్ద జమీందారు ఎంత గంభీర ప్రకృతికలవాడైనా, బాసులీ దివాణానికి వెళ్ళినప్పుడు వారిదర్శనం ఎంత దుర్లభమయినా, ఇక్కడకు వచ్చినప్పుడు మాత్రం దీనికి పూర్తిగా వ్యతిక్రమం కన్పిస్తూ ఉండేది. ఇక్కడ వారి ఆఫీసులోకి సాహసించి ఎవరైనా వచ్చి ఎదుటపడగలిగితే మాత్రం నృపతుల్యుడైన జమీందారుగారి ఆదరాన్ని పొందకుండాపోరు. కాని చిన్న జమీందారు స్వభావం దీనికి పూర్తిగా విరుద్ధం. ఎవరైనా దర్శనం కోరివచ్చేట్లయితే దివాణంలో పొందిన అవకాశాన్నే ఇక్కడ పొందుదామనే ఉద్దేశంతో ఇంత పట్టుదలగా వస్తున్నారని నిర్ణయించుకునేవాడు. అతడలా వ్యవహరించటంవల్ల - దర్శనంకోసం వచ్చినవారికి కావలసిన దూషణలూ తిట్లూ లభిస్తూ ఉండేవి. కేవలం ఆ ప్రాంతంలోని ప్రజలేకాదు, ఆ భవనంలో ఉండే పరిచారకులు మొదలైనవాళ్ళుకూడా చిన్న జమీందారు వచ్చాడంటే చాలు, హడలిపోతూ ఉండేవాళ్ళు. గోప్యం చెయ్యటం మాట దేముడెరుగు - ఏ కొద్ది పొరపాటు జరిగినా వాళ్ళకు విముక్తి అంటూ ఉండదు. కఠినశిక్ష అనివార్యమే అన్న సంగతి వాళ్ళకందరికీ తెలుసు. అంచేత అందరూ ఇతడెప్పుడు వెళ్ళిపోతాడా అని భగవంతుణ్ణి ప్రార్థిస్తూ ఉండేవాళ్ళు.

కాని ఈసారి మాత్రం వారి మొర భగవంతుడి చెవిని పడలేదు. ఎంచేతనో చిన్న జమీందారు ఏడెనిమిదినుండి సహచరులతో వచ్చి మూడు మాసాలనుంచి స్థిరంగా ఇక్కడే ఉంటున్నాడు. అక్కడ ఆఫీసులో పని అదీ వదిలిపెట్టి ఇంతకాలం ఇక్కడ ఉండటానికి పెద్ద జమీందారుగారి అంగీకారం లభించింది - విచక్షణులైన గృహచికిత్సకుల సలహాతో బలంతో చిన్న జమీందారు ఈ అంగీకారాన్ని పొందకలిగాడు. కాని దీనికంతకీ వేరే గూఢోద్దేశ్యం ఒకటుంది. కాని సదా సందిగ్ధ హృదయుడూ ఎంతో తెలిసినవాడయిన జమీందారు మాత్రం అది ఆమాకీగాకూడా కనిపెట్టలేకపోయాడు.

ఈ విషయంలో చిన్న జమీందారుకు సహాయకుడు, విచక్షణుడైన గృహవైద్యుడూ - విశ్వామిత్ర ముజుందార్, *M. B.* అనే కొత్త వ్యక్తి పరిచయం ఇక్కడ చెయ్యక తప్పదు.

ఎంతో ధనం వ్యయంచేసి సరస్వతీ నది

మూలం : మణిలాల్ వంద్యోపాధ్యాయ    అనువాదం : మద్దిపట్ల సూరి



ఒడ్డున ఈ భవనం కట్టించి, కాల్వలు త్రవ్వించినట్టే- తమ ఊళ్లో ఒక ఆస్పత్రి కూడా పెట్టించి, అది చక్కగా నడవటానికి ఏర్పాట్లూ అవీ చేసి గంగూలీ వంశీయులు చాలా కీర్తి-ప్రతిషలు సంపాయించారు. గవర్నమెంట్ సర్వీస్‌నుంచి రిటైరయిన, అనుభవజ్ఞుడైన సివిల్ సర్జన్ ఎవరో ఒకరు ఎక్కువ జీతంమీద ఇక్కడ నియమింపబడి, ఆస్పత్రిని ఎంతో శ్రద్ధగా నడుపుతూ ఉండేవాళ్లు. అతడు గంగూలీ వంశీయుల ఆరోగ్యం విషయమై ఎంతో సావధానంగా కూడా ఉండేవాడు. సుప్రసిద్ధుడైన అమరనాథ్ బెనర్జీ అనే సివిల్ సర్జన్ రెండేళ్ల క్రితంవరకూ ఈ ఆస్పత్రికి ప్రధానవైద్యుడుగా ఉంటూ ఉండేవాడు.

 

# స్వయంసిద్ధ



అతడు ఈ ఆస్పత్రిని ఎంతో అభివృద్ధికి తీసుకువచ్చాడు. అతడి హస్తవాసి ఎంత మంచిదో - అంత మాటమంచితనంకూడా ఉండేది అతడిలో. ప్రజలంతా అతణ్ణి 'ధన్వంతరి' అని పొగడుతూ ఉండేవాళ్ళు. దేవుడులాంటి ఈయన దయతలచి డాక్టర్ విశ్వామిత్ర ముజుందార్‌ను ఇక్కడ తాత్కాలికంగా తనకు అసిస్టెంట్‌గా నియమించుకున్నాడు. ఆ సమయంలో ఈ ప్రాంతాల్లో కలరా విజృంభించి ఊళ్లకు ఊళ్లు తుడిచిపెట్టటం మొదలెట్టింది. తాత్కాలికంగా ఒక అసిస్టెంట్ కావాలని పత్రికల్లో ప్రకటించగానే కొద్దిరోజుల్లోనే కొన్ని వందలమంది డాక్టర్లు పెట్టుకున్న అర్జీలు అమరనాథ్‌ని విశ్వ కుణ్ణి చేశాయి. సరిగ్గా అప్పుడే కలకత్తా మెడికల్ కాలేజీ మెడల్‌ను, డిప్లమాను పుచ్చుకుని, పంజాబ్‌లోని కొన్ని ప్రైవేట్ ఆస్పత్రుల సర్టిఫికెట్లూ, కొంతమంది ప్రసిద్ధుల సిఫార్సులూ తీసుకుని, డాక్టర్ ముజుందార్ ఈ బెంగాలీ ఆస్పత్రిలోకి వచ్చిచేరాడు.

మొదట చూడగానే వయసు చెల్లిన అమరనాథ్ బెనర్జీకి ముజుందార్ వేష భాషలు సంతృప్తికరంగా లేకపోయినా, అతడి చేతనున్న ఈ ఆయుధాల నన్నిటిని నిర్లక్ష్యభావంతో త్రోసి పారెయ్యలేకపోయాడు. ఈ క్రొత్తగా వచ్చిన డాక్టరు క్రూరదృష్టిని ప్రధాన చికిత్సకుడైన బెనర్జీమీదికి పరపుతూంటే - సహచరులు [illegible]గా "ఇదెక్కడి దృష్టిరా బాబూ! [illegible] దృష్టి" అని అనుకుంటూ ఉండేవాళ్ళు.

వాళ్లనుకున్నది కొద్దిరోజుల్లోనే యథా[illegible]గా పరిణమించి, ప్రధాన చికిత్సకుని [illegible]ద పనిచేసింది. ఆ ప్రాంతాల్లోని కలరా [illegible] నెలలోనే తగ్గిపోయింది. ఈ క్రొత్తగా [వ]చ్చిన ముజుందార్ మూడునాల్గోల్లో తన [ఉ]ద్యోగాన్ని విడిచిపెట్టి పోవాల్సిం[ది]. కాని మరికొన్ని సిఫార్సుల బలిమి [వల్ల] తాత్కాలికంగా వచ్చిన డాక్టరు [స్థిర]మైన అసిస్టెంట్‌గా నియమింపబడ్డాడు. తర్వాత కొద్దిమాసాలకే - అస్పత్రి నిర్విఘ్నప్రదంగా చూసుకుంటూ ఎంతో [అభి]వృద్ధిలోకి తీసుకువచ్చిన ధన్వంతరి[లా]ంటి అమరనాథ బెనర్జీ సకుటుంబంగా [బెం]గులీ గ్రామాన్ని విడిచిపెట్టి పోవలసి [రా]టం, ఆ స్థానంలో ముజుందార్ నియమింపబడటం చూసి ఊళ్ళోవాళ్ళంతా ఆశ్చర్యపోయారు. దీనికంతకీ వెనుక ఉండి జరిగిన కుతంత్రాలన్నీ తెలుసుకో గలిగిన సామర్థ్యం ఆ ఆస్పత్రి నిర్వాహకులకు ఉన్నది; కాని వాళ్లెవరూ ఈ శని దేవత వక్రదృష్టి ఎదుటకు వచ్చి నిలబడటానికి సాహసించలేకపోయారు.

తర్వాత దుర్ముఖుడైన చిన్న జమీందారుకీ, ఈ ఆస్పత్రి డాక్టరుకీ ఎంతో స్నేహం కలిసింది అని తెలుసుకున్నప్పుడు - ఎస్టేట్ ఉద్యోగులు, ఆస్పత్రిలోని ఉద్యోగులూ అందరు విస్తుపోయారు.

ఈ ఉభయుల సమావేశానికి వనుక జరిగిన గాథ ఇది.

వండిమీద ఫిర్యాదు చెయ్యటానికి నివారణుడు తండ్రిదగ్గరకు వెళ్ళగానే, మొట్టమొదట తనకి తగిలిన అఘాతాన్ని అతడు సహించలేకపోయాడు. మానసిక వేదనతో అతడు మంచం ఎక్కాల్సి వచ్చింది. అతడి కళ్ళు ఎర్రగా ఉండటం, శరీరం కంపించటం, ముఖం వివర్ణమైపోవటం, దృష్టిలో ఔదాసీన్యం వ్యక్తమవుతూ ఉండటం ఇవన్నీ చూసి పరిచారకులూ మొదలైనవాళ్లు గాభరాపడిపోయారు. తర్వాత విశు డాక్టరుగారికి కబురు పంపటం, కబురు అందిన మరుక్షణంలోనే అతడు ఆదరాబాదరా రావటం సంభవించింది.

ప్రాథమిక చికిత్సవల్లనే రోగి చాలా వరకు స్వస్థుడయినాడు - డాక్టరుగారు పరిజనులకేసి, గంభీరంగా చూస్తూ "ఒక గంటసేపు మీరంతా ఇక్కడినుంచి బయటికి వెళ్లాలి. ఈ గదిలోనే కాదు. అసలీ చుట్టుప్రక్కల ఎవరూ ఉండకూడదు" అన్నాడు.

పరిజనులంతా ఆ గదిలోంచి వెళ్ళిపోగానే డాక్టరు స్వయంగానే తలుపులు వేసివచ్చి, రోగి పక్క మీద కూచున్నాడు. రోగి దృష్టిఅంతా డాక్టరుమీదనే ఉంది. "[illegible]గారూ! నేను డాక్టర్ని. మీ జీవితాన్ని కాపాడవలసిన భారం నామీద ఉంచారు కనుక, మీ మానసిక కవాటాలు కూడా నాముందు బాహాటంగా తెరవండి. అభ్యంతర పెట్టకండి" అన్నాడు డాక్టరు.

"మిమ్మల్ని విశ్వసించమంటారా డాక్టరుగారూ!" అని వి[illegible]గా అడిగాడు నివారణుడు.

డాక్టరతణ్ణి [illegible]త్సహిస్తూ - "ఓ, నిస్సందేహంగా .. మీకు చికిత్స చేయటానికని మొట్టమొదట ఈ యింట్లో అడుగుపెట్టగానే, మీకు వ్యాధి ఉన్నది శరీరంలో కాదు, మనస్సులోనని చటుక్కున గ్రహించాను. ఆ వ్యాధికి అసలు అంకురం ఏమిటో నాకు కొంతవరకు తెలియకపోలేదు" అన్నాడు.

"అరె! మీకు తెలుసా? ఆశ్చర్యంగా ఉందే!"

"తెలియకపోతేనే ఆశ్చర్యమసలు: నేను వస్తుతః డాక్టర్ని. ఎవరి ప్రాణాల్ని కాపాడవలసిన బాధ్యత నామీదపడిందో, వారి వ్యాధిని గురించి సర్వదా సర్వథా కూడా జాగరూకుణ్ణై ఉండాలి. వారి మనస్సులోని విషయాలన్నింటినీ కూడా తెలియగలిగిన___"

"ఏమిటి?"

"కుటుంబ వైద్యుడికి అది కూడా కర్తవ్యం కిందనే లెక్క. మానసిక లక్షణాలు తెలుసుకోకుండా వ్యాధిని నయం చెయ్యగలగటం ఈ యుగంలో అసంభవం"

"అయితే నా మనస్సులో ఉన్న విచారమేమిటో ముందుగా తెలుసుకునే ఇక్కడికి వచ్చారన్నమాట!"

"నాకు కొంతవరకు తెలియకపోలేదని మొదట్లోనే చెప్పాను. ఇప్పుడిహ చెప్పక తప్పదు కనుక చెప్తున్నా నీమాట. మీ మనోవ్యాధి కొంచెం దూరం [illegible] దారి తీసింది. కేవలం '[illegible]' పరిస్థితి కాదనుకోండి. కాని ఈ మనోవ్యాధిని ధైర్యంగా త్రోసేసుకుని ధీమాగా నిలబడటమా___ లేదా దానికి లొంగిపోయి ఇంకా కృశిస్తూ పడిఉండటమా అనేది ఇహ అంతా మీ చేతుల్లోనే ఉంది."

"నా చేతుల్లోనే ఉందంటారా?"

"ఆహా నిశ్చితంగా. మీ మనస్సు ఇప్పటివరకూ అతిచురుకుగా అశ్వమేధయాగపు గుర్రంలా పరుగెత్తసాగింది. ఈ అశ్వం ముఖానవున్న ప్రతిజ్ఞాపత్రం చూసి ఇన్నాళ్లూ దీన్నెవరూ పట్టటానికి సాహసించలేకపోయారు. కాని యిప్పుడు హఠాత్తుగా కాలు మడతపడి అశ్వం కొస్తా పడిపోయింది. అందరూ దూరంగా నిలబడి చోద్యం చూసేవాళ్ళే కాని, దగ్గరకొచ్చి లేవతీసి, సేదతీర్చేవాళ్లు లేకపోయారు. దీన్ని కొన్నాళ్లపాటు ఇలాగే పడిఉండనిస్తే, ఈ అశ్వానికి కూడా జడభరతుడిలా ఉండే మీ అన్నగారి స్థితే దాపురిస్తుంది"

నివారణుడు వణికిపోయాడు డాక్టరు చెప్పింది అబద్ధంకాదని గ్రహించాడు. కొన్ని క్షణాలవరకు కూడా తన



ఇంద్రియాల్ని స్వాధీనంలో ఉంచుకోగల సామర్థ్యాన్ని కూడా కోల్పోయాడతడు. అంతేకాదు, మన స్తత్వ శాస్త్రజ్ఞుడైన డాక్టరు తన మనోవ్యాధిని గురించి చెప్పిన దాన్ని కూడా కాదనగల సత్తా లేదతనికి. ఇన్నాళ్ళదాకా ఏదో తే తన దయాధర్మాల మీద ఆధారపడినవాడేగా అని ఎవర్ని గురించి భావిస్తూ వచ్చాడో, అతడంటే అంతర్యంలో గౌరవభావం కలగసాగింది యిప్పుడు. కంఠస్వరాన్ని కోమలంగా మార్చుకొని కుతూహలంతో "నిజంగా మీకు చాలా సంగతులు తెలుసునట్లే ఉంది. సరేకాని ఆ గుర్రం అలా హఠాత్తుగా ఎందుకు పడిపోయిందో చెప్పగలరా మరి?" అని అడిగాడు.

"దారే వస్తున్నా ఒక చీరకొంగు కదలి కను బెదిరిపోయి, ప్రక్కమలుపు తిరగబోయింది. ఇలాంటి సందర్భాలలో అలా పడటం సహజమే."

"మళ్ళీ లేవటం?"

"డాక్టరు చికిత్సనీ సలహాను పాటిస్తే దానికేముంది?"

"కాని మీరు చీర ప్రసక్తి తీసుకొచ్చారే, దాన్ని ధరించిన ఆమె సంగతులు కూడా తెలుసా యేం మీకు?"

"ఓ; చాలా తెలుసు. నాకు తెలిసినవాటిల్లో మీకు నాలుగోవంతయినా తెలుసునో తెలియదో సందేహమే."

ఆమాట వినగానే కళ్ళు రెండూ పెద్దవి చేసుకుని చూస్తూ నివారణుకు లేవబోయాడు. కాని వెంటనే డాక్టరు అడ్డువచ్చి "లేవకండి ఇప్పుడు, పడుకునిఉండే వినండి నా మాటలు. మీరడగ తలచిందేమిటో అడగండి. నా మాటలు విన్నంతమాత్రాన మీ వ్యాధి చప్పున పారిపోతుందనిమాత్రం అనుకోకండి. కొద్దిరోజులపాటు మీరు రోగిలాగా పడుకుని ఉండాల్సిందే" అన్నాడు.

నివారణు డీమాటలు వినిపించుకోకుండా తాను ముందు అడిగిన విషయాన్నే మళ్ళీ తీసుకొచ్చి "నాకంటె కూడా మీకు ఎక్కువ సంగతులు తెలుసా?" అని అడిగాడు.

(30-వ పేజీ చూడండి)



# స్వయంసిద్ధ



"ఇందులో ఆశ్చర్యమేముందో అర్థం కావటంలేదు నాకు. ఆమె పంజాబ్‌లో తన మాతామహుడి ఒద్దికలో ఉంటుండే రోజుల్లో నేను అక్కడ ప్రాక్టీస్ చేస్తూ ఉండేవాణ్ణి."

"ఓః అలా చెప్పండి. అయితే—"

"అప్పుడు చాలా సంగతులు తెలుసుకోటానికి అవకాశం చిక్కింది నాకు. ఇప్పుడా సంగతులన్నీ అలా ఉంచండి. తర్వాత వినవచ్చు. ప్రస్తుతం నేను చెప్పతలచిన దేమిటంటే, ఆ పడిపోయిన గుర్రాన్ని మళ్ళీ లేవతీసి, దానికి చికిత్స చేసి, దాన్ని పరిగెత్తింప చెయ్యాలి. ఈసారింక దారి తప్పనీయకూడదు"

నివారణుడి బుర్రలో మొదట చెప్పిన మాటలే గిర్రున తిరుగుతున్నాయి ఇంకా. ఉత్సుకభావంతో అతడు మళ్ళీ ప్రశ్నించాడు. "మీకు పరిచయం అంటూ ఉన్నదంటే—ఆమెతో మాటా - పలుకూ కూడా ఆడిఉంటారన్నమాటేగా?"

డాక్టరు దీర్ఘంగా నిట్టూర్చి, "అలా ఉండాల్సిందేగా అసలు! ఆమె చివరికి అన్న మాటలు మాత్రం ఇప్పటికీ నా చెవుల్లో ఇంకా గింగురుమంటున్నాయి" అన్నాడు.

"అది దేన్నిగురించి డాక్టరు గారూ? చెప్పటాని కేమయినా అభ్యంతరమా?"

"ఏంలేదు. నేను చేసే మానసిక చికిత్సా విధానాన్ని గురించి ఆమె గేలిచేస్తూ ఒక రోజున 'మీరు ఫిజిక్స్‌ని విడిచిపెట్టి, 'ఫిజియానమీ'ని గురించి చర్చించండి. దానివల్ల ప్రజలముఖాల్లోని భావాలుచూసి, మనస్సులోని భావాల్ని చెప్పవచ్చు' అన్నది."

"మీరు జవాబు ఏం చెప్పారు?"

"జవాబు చెప్పేందుకు అవకాశం చిక్కలేదు. చూద్దాం, మీ గుర్రం నుక జయించిందంటే - ఆ కారణంగా వాబు చెప్పేందుకు అవకాశం లభిస్తుంది ండి"

ఆ మాట విని నివారణుడు డాక్టరు ముఖంకేసి సాభిప్రాయంగా చూశాడు. డాక్టరు వక్రదృష్టికూడా అతడిమీదే కేంద్రీకృతమై ఉంది. ఉభయులూ ఒకర్ని ఒకరు ర్థంచేసుకుని, తమ తమ హృదయాలను ష్కపటంగా వెల్లడించుకున్నారు. యస్సు చూద్దామా ఇద్దరికీ మధ్య పదేళ్ల వ్యత్యాసం ఉంది. అభిజాత్యము, అహంకారము. స్వస్వామి సంబంధమూ వీటన్నిటి మూలంగా ఈ ఇద్దరిమధ్యా ఇన్నాళ్లనుంచీ అడ్డుగాఉన్న గోడ, చాలా ఆశ్చర్యంగా మాయమైపోయిం దిప్పుడు.

నివారణుడి వ్యాధి, అది తగ్గే విధానమూ డాక్టరు హరినారాయణబాబుకు ఎలా చెప్పాడంటే—అతడు భయంతో డాక్టరు చెప్పినదానికి అంగీకరించే పద్ధతిని చెప్పాడు. 'పని యెక్కువగా చెయ్యటం, దానికి తోడు తీరని మనస్తాపం - ఈ రెండే ఈ వ్యాధికి మూలకారణాలు. దాన్ని నిర్లక్ష్యం చేస్తే త్వరలో పిచ్చి యెత్తినా యెత్తవచ్చు'...

డాక్టరు చెప్పినది ఆయనకు చాలా విశ్వసనీయంగానే కన్పించింది. అంచేత ఈ డాక్టరుగారి అజమాయిషీలో ఆ సరస్వతీ నది ఒడ్డున ఉన్న ఉద్యానభవనంలో ఉంటూ, ఆరోగ్యాన్ని కాపాడుకోటానికి నివారణుడికి తండ్రి అనుమతి ఇచ్చాడు.

ఆ ఉద్యానభవనంలో కొన్ని నెలలు ఉండటంవల్ల, అక్కడ ఉండే అనుచరుల సుహృద్భావంవల్ల, డాక్టరు సాహచర్యం వల్ల నివారణుడు కేవలం ఆరోగ్యాన్ని కాపాడుకోగలిగాడని చెప్పటానికి వీల్లేదు. దాంతోపాటు జీవితంలో అంతవరకూ అనాస్వాదితాలుగా ఉన్న ఒకటి రెండు క్రొత్త వస్తువుల పరిచయాన్ని అనుభూతినీ కూడా పొందకలిగాడు.

నివారణుడు టీ త్రాగుతున్నప్పుడల్లా డాక్టరుకూడా ఆ టేబిల్‌ముందే కూర్చుని పెగ్ మీద పెగ్ మద్యం సేవిస్తూ ఉండేవాడు. పైగా నవ్వుతూ - సహజంగా ఉష్ణతను కలిగించే ఈ పదార్థం మనోవ్యాధికి సాటిలేని దివ్యౌషధం." అని అంటూ ఉండేవాడు. ఒక వారం గడిచేసరికి నివారణుడి టీ కప్పులో ఈ మహౌషధాన్ని కొంచెం కొంచెం కలుపుతూ ఆ టీ యొక్క శక్తిని ఇనుమడింప చేశాడు. ఆ తర్వాతి వారంలో ఉభయులూ ఒకే పరిమాణంలో ఈ మహౌషధాన్ని సేవించేస్థితికి వచ్చారు. ఆ తర్వాతి వారంలో అసలు టీ త్రాగటం అనేది పోయి, కేవలం దీన్ని త్రాగటమే అలవాటయిపోయింది. ఉభయుల మధ్యా అదివరకుదాకా ఉన్న అంతరం ఈ త్రాగుడుబల్లముందు పూర్తిగా తుడుచుకుపోయింది.

మన తత్వవిదుడైన డాక్టరు, వ్యాధిగ్రస్తుడైన మిత్రుడి కోరికను సఫలీకృతం చెయ్యటానికి, ఈ కొద్ది మాసాలనుంచీ మనోవ్యాధికి సంబంధించిన మంగుల్ని గురి
క్రిందా మీదా పడుతున్నాడంటే, అ
విషయంలో అనాలోచితంగా చెప్పిన
తుంది. మనోవేగంతో అతడు జిల్లా అ
ఎక్కడికి పడితే అక్కడికి తిరుగుతూ
బానులీ యెస్టేట్‌ను పట్టెంలోకి లాగ
ఒక పెద్దకుట్ర పన్నసాగాడు.

శ్రీరామచంద్రుడికి వారధికట్టే
యంలో ఉడతకూడా వచ్చి స
పడింది. డాక్టరు సహాయంతో నివార
ప్రారంభించిన ఈ ప్రయత్న
పిన్నలు - పెద్దలు అనేకమంది
సహాయపడ నారంభించారు. బానులీ జ
దారుగారి కోడలి మనస్తత్వాన్ని గు
సేకరించిన యథార్థ విషయాలకి దేశ
విప్లవకారులు అనుసరించే నీతికీ చా
సన్నిహితత్వం ఉందట! శ్యామాపురం
ఈమె మొండి పట్టుదల మూల
జమీందారు ఉచిత విద్యాలయ
స్థాపించటం, ఆ విద్యాలయ
బాలికలంతా విధిగా వచ్చి చదువుకో
ఆమె చూపిన అధికారం మొదలైన
అతిశయోక్తులతో కల్పించబడ్డాయి వి
విద్యాలయంలో ఈమెవల్ల అవమా
పొందిన ఉపాధ్యాయిని కూడా వీరికి
కరించటానికి సంకోచించలేదు. జ
దారుగారి పాఠశాల ప్రారంభమయి
మిషనరీ స్కూల్లోకి వచ్చే బాలికలే
పోవటం మూలంగా స్కూల్ మూసి
వలసి వచ్చింది డిస్ట్రిక్ట్‌మిషన్ సొ
అధికారులుకూడా దీనికి చాలా
చారు. అటువైపునుంచి వచ్చిన
కారమూ తప్పకవదికాదు. జిల్లా క
మేజస్ట్రేటూ ఈ బానులీ జమిందా
'గుర్రు'గానే ఉన్నారు. కాని ఆయని
'కంట్రోల్' లోకి తీసుకోటానికి
కింతవరకూ యెక్కడా కారణ
కన్పించలేదు. హఠాత్తుగా ఇప్పు
యెస్టేట్‌ను గురించీ, ఆ జమీం
గురించీ రకరకాల ఆరోపణలు,
క్షంగా, పరోక్షంగా తమ చెంతకు
పడటంచూసి, వారు ఆశ్చర్యపో
ఇన్నాళ్ళకీ అయితేయేం ర
అనేది కన్పించింది కదా అనుకు
పై అధికారి దొర. కాని ఆ శా
ఆధారంగా చేసుకోటానికి
కొంచెం సంకోచంకూడా కలిగింది.
సహజమే. పేరు ప్రఖ్యాతులున్న
దారు, ప్రభుత్వం ఇచ్చే బిరుదాలకు
పడేరకంకాదు. చాలా పలుకుబ
వాడు. ఇది మిథ్యాభియోగం అయి



జమీందారు కొడుకు తలవని తలంపుగా అడి ప్రైవేట్ రూమ్‌లో ప్రవే… ఆ సంకోచాన్ని తొలగించాడు. డొక్కా జే రా లేదు, విను తనకు లీగల్ ఎడ్వైజరుగా వెంటపెట్టుకుని మరీ వచ్చాడు. దొరతో మాట్లాడేప్పుడు నివారణుకు పొరపాటున మరో ప్రసంగంలోకి దిగబోతే, విను డాక్టరు ఎంతో దక్షతతో సమర్థతతో దాన్ని కప్పిపుచ్చేవాడు.

ఈ సందర్భంలో - ఆ అపాధ్యురాలైన అమ్మాయి జమీందారుకి కోడలయిందని, ఆమే ప్రస్తుతం వృద్ధజమీందారుని తన గోటిమీద ఆడిస్తోందన్న సంగతీ తెలిసింది. ఆమెభర్త మూర్ఖుడు, జడుడు, వెర్రిబాగు…




# ఆనందముగానున్న కుటుంబముయొక్క చిత్రము!

ప్రతి చిరునవ్వులో ఒక గాధ వుంది. ప్రత్యేకం, నా కుటుంబం ముఖాలందుగల ప్రకాశమాన చిరునవ్వులలో. అయితే, ఇవ్వాళ నేను ఫోటో తీస్తున్నప్పటిలాగ ఆరోగ్యముగానున్న కుటుంబం కాదు లోగడ. కొద్ది మాసాల క్రితం నా భర్త తరచుగా జబ్బు పడుతుండేవారు. అందుచేత రాబడి తగ్గింది. దాన్నిమించి నా ముగ్గురు బిడ్డలూ చిక్కిపోతుండేవారు, ఖులాసాగా లేరు. వాళ్ల టీచరుతో అకస్మాత్తుగా జరిగిన సంభాషణవల్ల ఈ యవస్థ అంతటికీగల కిటుకు తెలిసింది. నా మనోబాధంతా చెప్పాక ఆమె ఈలా అన్నది: 'నా స్వంత ఊహకు క్షమించాలి, మీరు వాడే వంట క్రొవ్వుతో సంబంధించి యుండేమో ఈ సమస్య?'

చాల ఖరీదైన విడిగా అమ్మే శ్రేష్ఠమైన క్రొవ్వుపదార్థములను కొంటున్నాను అని చెప్పాను: సందేహం పోగెట్టే సమాధానం అవి అనుకొన్నాను. ఆమె తక్షణం ఇలా జవాబిచ్చింది: 'విడి క్రొవ్వుపదార్థాలు ఎంత మంచివైనా మురికి చేతులు, ఈగలచేత ఎల్లప్పుడూ తాకబడుతాయి. అంటే అవి అపరిశుద్ధమై జబ్బును తీసుకొనివస్తుంది.'

వెంటనే డాల్డా వనస్పతిని కొనమని ఆమె సలహా ఇచ్చింది. ఎందుకంటే, ముందు, ముఖ్యంగా, డాల్డా ఆరోగ్యాన్ని కాపాడుతుంది. ఏ పురుగులూ సీలుచేయబడ్డ డబ్బాలో చొరబడలేవు, డాల్డా వనస్పతిని తయారుచేయువారు శ్రేష్ఠస్థితి కలిగేవరకూ డబ్బాను బైటకు పోనీయరు.

ఆమె చెప్పింది నిజం అని నాకు నమ్మకమైంది. వెంటనే మా కుటుంబం డాల్డాతో వండిన పదార్థములంటే ఇష్టపడుటకు మొదలుపెట్టారు. ఆహారమునుండి డాల్డా తీసుకొనివచ్చు సహజరుచులంటే వారికి మిక్కిలి ఇష్టము. గాలి చొరకుండా సీలుచేయబడ్డ డబ్బాలలో డాల్డా వనస్పతిని కొనుటవల్ల అది ఎల్లప్పుడూ పరిశుద్ధమైనది, తాజాది, ఆరోగ్యకరమైనది, అని నమ్మొచ్చు. డాల్డా వనస్పతి నా కుటుంబాన్ని రోజంతా, సుఖంగా, ఆరోగ్యంగా, సంతుష్టిగా, యుంచుతున్నదని ప్రత్యక్ష నిదర్శనంగా ఈ ఛాయా చిత్రాన్ని భద్రపరుస్తాను. నా ఛాయా చిత్రంలాంటిది మీకు కావాలంటే మీ ఆహారాన్నంతా డాల్డా వనస్పతితో వండండి. ఇవ్వాళే ఒక డబ్బాను తీసుకొనండి. 10 పౌన్లు, 5 పౌన్లు, 2 పౌన్లు, 1 పౌను మరియు ½ పౌను డబ్బాలలో అమ్మబడు చున్నది. డాల్డాలో ఇప్పుడు విటమినులు ఎ.డి యున్నవి.

మంచి వంట క్రొవ్వును
యెన్నుకొనుట ఎలాగ?
ఉచిత సలహాకు ఇవ్వాళే క్రింది
అడ్రసుకు వ్రాయండి:
ది డాల్డా అడ్వైసరీ సర్వీస్
పోస్ట్ బాక్స్ నంబరు 353, బొంబాయి!




చెట్టుతోనున్న
డబ్బాకై చూడండి

**డాల్డా వనస్పతి**

వంటకు దివ్యమైనది—ఖర్చు తక్కువ

HVM. 220-X52 TL

# ★ స్వయంసిద్ధ ★

వాడు. కనుక జ్యేష్ఠుడయినప్పటికీ బాసలీ సింహాసనాన్ని అధిష్ఠించే అధికారాన్ని కోల్పోయాడు. కాని కోడలి ప్రేరేపణవల్ల జమీందారు ఆ వెర్రిబాగులవాణ్ణే గద్దె ఎక్కించటానికి ఉద్యుక్తుడయినాడు. దీని వల్ల ఒకరకంగా కోడలే బాసలీజమీకి అధికారిణి అవుతుంది. అలా కనుక జరిగేట్లయితే ఈ ప్రసిద్ధమైన సంస్థానం ప్రభుత్వంతో సహకారాన్ని సద్భావాన్ని నిలబెట్టుకో లేదు. ఈ అమ్మాయి స్వభావమూ, మనస్తత్వమూ అభ్యంతరకరములైనవి. దేశంలో విప్లవ మార్గంలో ముందుకువచ్చిన స్త్రీ లెవరయితే ఉన్నారో వారందరితోనూ ఈమెకి సంబంధబాంధవ్యాలు ఉన్నాయి.

ఇలా చాలా సంగతులు మాట్లాడినతర్వాత దొర నివారణుడ్ని ఊరటపరిచి, 'షేక్ హాండ్'తో ఆప్యాయత ఉన్నట్లు వ్యక్తపరిచి పంపించివేశాడు. డాక్టరుకూడా తగిన మర్యాదలు పొందక పోలేదు.

ఇది జరిగిన పదిహేనురోజులకి ఈ ఉద్యానభవనంలో ఒకనాడు అర్ధరాత్రివేళ ఆనందమహోత్సవం సాగుతోంది. నృత్య గీత వాయిద్యాలతోపాటు మధుసేవకూడా సాగుతోంది కలకత్తానుంచి డాక్టరుగారి బంధుమిత్రులు కొందరు వచ్చారిక్కడికి. ఆ సందర్భాన్ని పురస్కరించుకుని ఈ ఉత్సవం ఏర్పాటయింది. పెగ్ మీద పెగ్ వేసుకుంటూ ఉండటంతో ఉత్సవం మాంచి జోరుగా సాగిపోతోంది. ఈస్థితిలో ఉండగా ఈ ఉద్యానభవనంయొక్క ద్వారం చెంతకు గుర్రంమీద ఒక వార్తావహుడువచ్చి నిలబడటంతో, వీరిలో కొంతమంది మైకం వదిలింది. అతడు కంగారుగా లేచివెళ్ళి చూశాడు. బయట ఆ అశ్వారోహకుడు ఎదురుగా చూస్తూ నిలబడిఉన్నాడు. అతడి దుస్తులు చూడగానే వార్తావహుడని తెలిసిపోతోంది

తలుపు తెరవగానే అశ్వారోహకుడు పెదబాబుగారిదగ్గిర్నించి ఉత్తరం తీసుకుని వచ్చాననీ, దాన్ని యిప్పుడే చినబాబుగారి చేతికి యివ్వాలని, చాలా అత్యవసరమైన పని అని చెప్పాడు. చిన్న జమీందారప్పుడు ఉత్తరం చదవగల స్థితిలో లేడు. విను డాక్టరే విధిలేక ఉత్తరం చించవలసి వచ్చింది. ఎన్ని పెగ్ లు సేవించినా అతడు ఇంకా స్పృహలోనే ఉన్నాడు. అతడు ఉత్తరాన్ని ముందు మనస్సులో చదువుకుని 'హుర్రే!' అని అరిచాడు.

బలవంతాన అందరూ ఒక్కక్షణం కళ్ళెత్తి చూశారు. అక్కడ ఉన్నవారందరూ ఇంచుమించు ఒకే స్థితిలో ఉన్నారు. డాక్టరు ఆ ఉత్తరాన్ని పైకి గట్టిగా చదివేశాడు.

"—హరినారాయణ గంగోపాధ్యాయ ఆశీఃపూర్వకంగా: ఇప్పుడే విశ్వసనీయ వర్గాలద్వారా - ప్రెసిడెన్సీ కమీషనర్, జిల్లా కలెక్టరుగారూ వేటకోసం బయలుదేరి ఈ ప్రాంతాలకి వస్తారని తెలిసింది. వారు ఎల్లుండి మన ఉద్యానభవనానికి వెంచేసి మన ఆతిథ్యాన్ని స్వీకరించగలమని తెలియచేశారు. కనుక నువ్వు ఉన్నవాడివి ఉన్నట్టుగా డాక్టర్ని వెంటపెట్టుకుని రావలసింది."

ఆశీస్సులతో

శ్రీ హరినారాయణ గంగూలీ—"

పెద్ద జమీందారుగారి ఈ అర్జంట్ ఉత్తరం - ఇంత ఆనందకరమైన వార్తను తీసుకురాగలదని నివారణుడు కాని, డాక్టరు కాని యెవ్వరూ ఊహించుకో లేదు. కాని విచారకరమైన సంగతేమిటంటే— ఆ ఉత్సవం పరిసమాప్తి చెందలేదింకా. అయినా డాక్టరు సలహా ననుసరించి అందరూ మద్యంతో నిండిన గ్లాసులు చేత పట్టుకుని లేచి తూలితూలి పడుతూ 'మహా గౌరవనీయులైన కమీషనర్ - కలెక్టరు దొరల నుద్దేశించి సంప్రదాయానుసారం ఆ గ్లాసుల్ని ఒండొంటిని తాకించుకున్నారు తమ వాంఛితం ప్రాప్తి కాబోతున్నందుకు అందరూ మళ్ళీ ఆ అర్ధరాత్రి నిశ్శబ్దతకు భంగం కలిగించారు- 'హిప్... హిప్...హుర్రే' అంటూ.

## 21

'అమ్మా! అమ్మా! అమ్మా!'

భర్త - వ్యాకులపాటుతో, ఆర్త కంఠంతో ఇలా ఉచ్చరించటంతో చండికి నిద్ర మెళుకువ వచ్చింది కంగారు పడుతూ లేచి ఆమె ముందు గబగబా దీపం దగ్గరకు పరుగెత్తి, దీపాన్ని పెద్దది చేసి చూసింది. భర్త పక్కమీద కూచుని ఉన్నాడు. అతడి కళ్ళు పత్తికాయల్లా ఉన్నాయి ముఖంలో ఏదో నూతన భావ వికాసం ద్యోతకమవుతోంది.

"ఏమిటి? ఏం జరిగింది? అలా కలవరిస్తున్నారేమిటి?"

భార్య ఇలా అడగటంతో అతడికి చైతన్యం కలిగింది దృష్టిని స్వాభావికంగా మార్చుకుని, భార్యకేసి చూసి, భావగద్గద కంఠంతో, "మా అమ్మ సాక్షాత్తూ వచ్చి, నా మంచంమీద కూర్చుని, తన చేతులతో

నా శరీరమంతా నిమిరింది ఆ స్పర్శతో నా వీపునిండా కలువరేకులు కప్పినట్లు అనిపించింది ఇప్పటికీ ఆ అనుభూతి పోలేదు. సరీగ్గా ఆ చిత్తరువులో ఉన్నట్లుంది. కాని శరీరచ్ఛాయమాత్రం తెల్లటి తెలుపు" అన్నాడు.

చండి ఏమాత్రం విస్మయాన్ని వ్యక్తపరచలేదు. ఏమీ ప్రశ్నించనూలేదు. స్నిగ్ధస్వరంతో "సాధనలో చిత్తశుద్ధి ఏర్పడగానే దివ్యభావం కలుగుతుంది ముందు - ఆ వెనువెంటనే దివ్యదర్శనం కూడా లభిస్తుంది. ఇందులో ఆశ్చర్యపడవలసిందేమీ లేదు" అని మాత్రం అన్నది.

"నేనయినా ఆశ్చర్యపోలేదు, కాని చాలా దుఃఖమొచ్చింది - లేచి కూర్చుని అమ్మని చూడలేకపోయానుగా మరి!"

భార్య మెల్లగా భర్తను ఓరడిస్తూ "కళ్ళతో చూస్తేనే చూసినట్లా యేం? ఆమెమీద అచంచలమైన భక్తిఉంటే మనస్సుకి సర్వదా కనిపిస్తూనే ఉంటుంది..." అన్నది.

సరిగ్గా ఇంతలో బయట తలుపులు చప్పుడు కావటంతో దంపతులిద్దరూ చకితులయినారు. వేళకాని వేళ ఎవరిలా వచ్చి తొందర కలిగిస్తున్నారు! ఇద్దరూ గడియారంకేసి చూశారు నాలుగు కొట్టటానికి ఇంకా కొంత వ్యవధి ఉంది.

ఇవాళ తలుపులు తీయటానికి గోవిందుడే ముందుకు వెళ్ళాడు. భార్య, భర్త అలా చొరవచేసుకు వెళ్ళటాన్ని ముగ్ధురాలై చూడసాగింది. అతడి అవయవాలకదలికలో పౌరుషం వ్యక్తమవుతూ ఉండటం చూసి, ఆమె తన్మయురాలు కాసాగింది. 'ఘళఘళలాడే లావణ్యం...ధరణిఅంతటా నిండింది' అన్న పదావళిలోని మధురమైన చరణం చటుక్కున ఆమె గొంతులో గునగునలాడింది.

గోవిందుడు తిరిగివచ్చి, "నాన్నగారికి హఠాత్తుగా జబ్బు చేసిందిట! నీకోసం కబురు చేశారు. బయట పరిచారికలు నీకోసం నుంచుని ఉన్నారు" అని చెప్పాడు.

ఆమెకి విచారం కలిగింది. కనుబొమలు చిట్లించి, "నాకోసం కబురు చేశారంటే ఏదో పెద్దజబ్బే చేసి ఉంటుంది. మరి మీరు కూడా రారూ?" అని అడిగింది.

గోవిందుడు మ్లానముఖంతో "నాకు కబురు చెయ్యలేదుగా!" అన్నాడు.

"ఏదైనాసరే - అది చేసినప్పుడు మీకు కబురుపంపట్టంకూడా అవసరమన్న అభిప్రాయం వారికింకా గట్టిగా యేర్పడలేదు" అన్నది చండి.

ఆమాట వినేసరికి గోవిందుడి మనస్సులో అభిమానం జాగృతమయింది.

"నాన్నగారు నేను ఇంకా అలాగే ఉన్నానని అనుకుంటున్నారు. వారు వచ్చినప్పుడు నేను ఏదో లెఖ్ఖలు చేస్తూ ఉండటం గమనించారు. నన్ను ప్రశ్నించనుకూడా ప్రశ్నించారు నేను దానికి సరియైన జవాబే ఇచ్చాను. ఆ తర్వాత ఈ కొద్దిమాసాల్లోనూ నేనింక అభ్యున్నతిని ఏమీ సాధించనట్లేనా!"

భర్తమాటలు చండి మనస్సుకు నాటాయి. కాని ఆమె ఈ విషయంలో అతడ్ని ఏమీ ఉత్తేజితుణ్ణి చెయ్యకుండా ఉందామనే ఉద్దేశంతో "బహుశా ఇలాకూడా అయి ఉండొచ్చు. అప్పటినుంచీ వారికి ఒకరకమైన పశ్చాత్తాపంకూడా కలిగి ఉండవచ్చు. మీరు చదువులో ఇంకా అభివృద్ధిని సాధించి ఉంటారనే ఊహించిఉంటారు. మిమ్మల్ని పిలిపించటానికిమాత్రం కొంత సంకోచం బాధించి ఉండవచ్చు. అయినా మీకు అభ్యంతరం లేకపోతే ఈ స్థితిలో మీఅంతట మీరు వెళ్ళినా తప్పేమీ లేదు. వారు మిమ్మల్ని చూసి సంతోషిస్తారు" అన్నది.

గోవిందుడు ఒక్కక్షణం తనలో తాను యేదో ఆలోచించుకుని జిజ్ఞాసా దృష్టితో భార్య ముఖంకేసి చూస్తూ "కాని దానివల్ల ప్రయోజనం ఉండదేమో? అస్వస్థతగా ఉంటున్నప్పుడు దుఃఖకరమైన వార్తలు చెవిని పడనీయకూడదని, సంతోషకరమైన వార్తలు కూడా హఠాత్తుగా కనుక వినిపిస్తే దానివల్లకూడా కొంత చెరుపు సంభవించవచ్చునని, ఎక్కడో చదివినట్లు జ్ఞాపకం నేను చాలావరకు శిక్షితుడనయినానని తెలిసినా, నాన్నగారి అస్వస్థత ఇంకొంచెం ఎక్కువ కావచ్చు" అన్నాడు.

చండి ప్రశంసాసూచకమైన దృష్టితో భర్తముఖంకేసి చూస్తూ "కాని నాకు ఈ ఆలోచన తట్టలేదు. నిజంగానే మీరు తల్లి అనుగ్రహాన్ని పొందగలిగారు. వివాహం నాటి రాత్రి మీ మాటలువింటే ఎలా ఉందో ఇవాళ అలాఉంది నాకు" అన్నది.

భార్య మాటలకి గోవిందుడు కళ్ళు రెండూ ఉజ్వలంగా చేసుకుని, "ఆరోజు, నువ్వు నాతో ఎన్ని మాటలయితే చెప్పావో అన్నీ ఆచరణలో పెట్టావు నీమూలంగానేగా నేనివాళ ఈమాత్రం శిక్షితుణ్ణయినా అయింది!" అన్నాడు.

భార్య ముఖం సిగ్గుతో కొంచెం ఎర్రబడినా, నిర్మలమైన మందహాసంతో ముఖాన్ని ఉజ్వలంగా చేసుకుని, "మీరు శిక్షితులైంది, మీ మానసికబలంవల్ల" అన్నది.

"కాని నా మనస్సుకు ఇంత శక్తిని కల్గించిందెవరు? శిక్షితుడనయినాక నాకేమనిపిస్తున్నదో తెలుసా? చదువురానివాళ్ళు కేవలం దౌర్భాగ్యులు! నిన్ను పొందకపోయినట్లయితే నేను జీవితమంతా అలా దౌర్భాగ్యుణ్ణిగానే ఉండిపోవాల్సివచ్చేది. అందరూ నన్ను ఈసడించుకుంటూ ఉండేవారు. ఇంకా నాకు ఆ జడత్వం పూర్తిగా పోలేదు. నీకింకా అడ్డుగా నుంచునే ఉన్నాను. నువ్వు సరాసరి ముందు నాన్నగారి దగ్గరకి వెళ్ళు. మళ్ళీ నీ రాకకోసం ఎదురుచూస్తూ ఉంటాను."

చండి ముగ్ధదృష్టితో రెప్పవాల్చకుండా భర్త ముఖంకేసి చూసింది. గోవిందుడు నిండుగా ఆమె ముఖంలోకి చూసేసరికి ఉభయులకళ్ళూ కలుసుకున్నాయి. దాంతో ఇద్దరిముఖాలూ అపూర్వకాంతితో ఉద్భాసితములైనాయి.

(సశేషం)

వనితాలోకం :

# ఇంటి నీడలో

'విజయా!' అని పిలిచాడు మాధవరావు. నిజానికి అతను ఎంత బాగా పిలుస్తాడు! తనకా పేరుండడం, ఆ పేరు పే తన భర్త అంత చక్కగా పిలవటం ఎంత చిత్రం! మాధవరావు తనను పేరు పెట్టి పిలిచినప్పుడల్లా తన హృదయం చిగురులు తొడుగుతుంది. పేరులో ఉందా ఆ మాధుర్యం? లేక అతని కంఠస్వరంలోనే వుందా ఆ మృదుమధుర సంగీతం?!... కాక పోతే రెంటిలోనూ అతిశయించిన మనోహరత్వమే తనను సమ్మోహింపజేస్తుందా? ఏమో... కాని అతనలా పిలిచినప్పుడల్లా విజయ కేదో రసానంద ప్రపంచంలో వున్నట్టే ఉంటుంది.

'టైమైపోతోందమ్మా! కారు సిద్ధంగా వుంది. త్వరగా రావాలి. నిన్ను కాలేజీ దగ్గరా, వాణ్ణి యూనివర్సిటీ దగ్గరా దింపి నేను కోర్టు కెళ్లాలా మరి? చప్పున రావాలి.'

వీధిగదిలో కాలు గాలిన పిల్లిలా పచారు చేస్తున్న మామగారి బొంగురు గొంతుక!

ఓ పక్కన నెలలపిల్ల ఇలెగిరిపోయేట్టు అరుస్తోంది! .. 'ఛీ.. పాడుపిల్ల ఇప్పుడే లంకించుకోవాలీ ఏడుపు?!...' అవతల రెండు పిలుపులొచ్చాయి విజయకి విసుగూ, చిరాకూ, దుఃఖం కూడా వస్తాయి ఈ ఘట్టాల్లోనే పిల్లని సముదాయిస్తోంది. ఓమూల అత్తగారీ హడావుడి కేం విసుక్కుంటుందో, అన్న భయం!..అయినా తనెందు కావిడంటే భయపడాలి? ఆవిడకి అయిష్టంగా తానేనాడూ ప్రవర్తించలేదు. ఇకముందు కూడా ప్రవర్తించదు. ఇంకా విపులీకరించి చెప్పాలంటే ఆ యింట్లో తానేపని చేసినా ఇతరులను తృప్తిపరచటానికే చేస్తోంది. అందుకు తన మనస్సే సాక్షి కాని ఈ చదువువిషయంలో ఉదయం కాలేజీకెళ్లే ముందున్న హడావుడితో అనుక్షణం అత్తగారే నిమిషంలో ఏమంటుందో అన్న భయంమాత్రం విజయకి తప్పదు. అత్తగారు రానేవచ్చింది '(వెళ్లు తల్లీ! ఆ పిల్లనిటు తేవే సముదాయిస్తాగాని..ఏవిటో సంసారం చేసేదానికి, అందులో పిల్ల తల్లికి ఏం చదువు నా ముఖం!... పెళ్లాం చదువులు వెలగబెట్టి ఊళ్లేలాలని ఒకటే పోరు! చూస్తున్నాంగా సౌభాగ్యం'...విజయ పిల్లనందించి పుస్తకాలు తీస్తూ వింటోంది అత్తగారి మాటలు. అవును. ఆ మాటలు తన కలవాటే. సాధారణంగా వింటూనే వుంటుంది కాబట్టి అట్టే మనస్సును బాధించవు పుస్తకాలు తీసుకుని బైటికి వస్తోంది అత్తగారు విసుక్కోటం అయింది కాబోలు చంటిదాన్ని ముద్దుగా బుజ్జగించటంలో పడింది వ్యవహారం. ఈమధ్యలోగా మరో పిలుపుకి మాధవరావు రానేవచ్చాడు ఎదురు. 'అన్నట్టు అమ్మాయ్! ఇవాళ మధ్యాహ్నం వచ్చెయ్యాలి సుమా! మరిచిపోయేవు! మళ్ళీ రేపు పూజా పునస్కారమూనా... కొత్త పిలుపూ అదీ ఇవాళే చూసుకుంటే మంచిదని'—

## "కల్యాణి"

అత్తగారి ఈ మాటలు విజయకి తరుచు వినిపిస్తూనేవున్నా విన్నప్పుడల్లా ఏదో భరించరాని కోపమో, మరే వికారమో ఆపాదమస్తకం వ్యాపిస్తుంది! అస్తమానం ఏవో నోములూ, వ్రతాలూ, పూజలూ, పునస్కారాలూ, పేరంటాలూ, ఉద్యాపనలూ, ఏవిటో ఈ చాదస్తం?... కాని తనెంత బాధపడుతోందో ఎవ్వరికీ అక్కర్లేదు. ఎవరి అవసరాలు వారికి తీరిపోతే సరి!

'ఇవాళ మధ్యాహ్నం ముఖ్యమైన పాఠం వుందండీ...వీలుపడదేమో...' ఛీ వెధవది ఏం చెప్పాలన్నా ఏం మాట్లాడాలన్నా పాడు కంఠాని కింత వణుకెందుకో... అబద్ధం కాదుగా!...అయినా ఏనాడూ తను ఖచ్చితంగా చెప్పలేదు. ఏదో భయం కంఠంలో మసుల్తూనే వుంటుంది!...

'ఏవిటీ ముఖ్యమైనదుందా...ఏం చోద్యమే మామ్మా ఈ చదువులూ నువ్వూ ...ఓ అచ్చటా ముచ్చటా?...అదేదో ఈ ఒక్కరోజుకి మానేసే (దానమ్మ కడుపు కాల!) మునిగిపోతుందే తల్లీ! నీయిష్టం బాబూ...చదువెంగుకు ఊళ్లేలాలా అంటే విన్నారు కనకనా' మరింక వినిపించలేదు. విజయ కారెక్కింది...మాధవరావన్నాడు. 'ఆ...మునిగిపోయింది లేదు లే...క్లాసు లయ్యేకే రా!...అని. మాటలనటంతో టే సరికాగు...తను రాకపోతే ఏం జరుగుతుందో విజయకి బాగా తెలుసు అత్తగారు పనంతా తనమీదే పడిందనుకొంటుంది... కోపగిస్తుంది కోరికలు తీరుస్తుంది అనుకున్నాను గాని - మరింకా ఇటువంటివే అసంతృప్తి, అసంపూర్తి వాక్యాలు మరేవో...విజయకి అత్తగారిమాటల్లో తన హృదయాన్ని దూసుకుపోయే శూలాలున్నాయని ఎప్పుడూ బాధపడలేదు. పూర్వాచారపరాయణురాలైన ఒక పెద్దముత్తైదువ అసంతృప్తి మాత్రమే ఆవిడ మాటల్లో విజయకి ధ్వనిస్తుంది...తనమూలంగా ఆవిడెందుకు అనుకోవాలి?... ఎంత కష్టం అయినా సరే ఆవిడ చెప్పిన పనే చేద్దాం అనే భావమే విజయకి కలుగుతుంది. ఇక మామగారి విషయం చూస్తే ఆయనకీ సంగతులేవీ పట్టవేపట్టవు సమయాని కాలస్యం చేయకుండా కారెక్కడానికివస్తే సరి...

అంతా మంచివారులానే కనిపిస్తూన్నా అప్పుడప్పుడు ఏవో గ్రహింపరాని కాఠిన్యాన్ని మనసులో దాచుకున్నట్టుగానే కనిపిస్తారు విజయకి. తమ మూర్ఖపు పట్టుదలలన్నీ తనమీద రుద్ది తనద్వారా తమ కోర్కెలు నెరవేర్చుకోటంతో రాక్షసుల్లా కనిపిస్తారు. భర్త కిష్టం కనక చదువుకోవాలి. అత్తగారి కచ్చటా ముచ్చటా కనక నోములూ వ్రతాలూ నెరవేర్చాలి. మామగారి కాలస్యం కాకుండా సిద్ధం కావాలి. మరి చంటిపిల్లకి మాత్రం తనమీద హక్కు లేదా?...అది ఏడుస్తుంది! దాన్ని సముదాయించాలి. ఇవన్నీ అక్షరాలా ఆడదై పుట్టినందుకు తను నెరవేర్చాల్సిన విధులు. విజయకి ఆలోచిస్తూంటే ఏడుపొస్తుంది. ఈ నోములెందుకు? ఈ చదువెందుకు? ప్రాణానికి సుఖం లేకపోయాక!



అయినా ఎందుకని తను ప్రశ్నించే అధికారం లేదు. ఎందుచేతనంటే అవి తన బాధ్యతలు!...వాటికి తిరుగులేదు...మరీ చిత్రం ఏవిటంటే ఎవరి అవసరం వారికెక్కువగా కనపడుతుంది.

'నువ్వు చదువుకోటం నా కోరిక కనక అది నువ్వు నెరవేర్చాలి. ఇంక అమ్మ చాదస్తపు నోములూ వ్రతాలూ అంటావా? అవాళ్టి అవసరం కాకపోయినా ఆవిడ సంతృప్తికూడా నీకు కావాలంటే చెయ్యి. లేదా మాను.' అంటాడు మాధవరావు.

'ఎక్కడ ఏపని వుండనీ అమ్మాయ్... సరిగ్గా తొమ్మిదిన్నరకి నువ్వు సిద్ధం కావాలి. నాకు కోర్టుకి మాత్రం ఆలస్యం కాకూడదు...' పన్క్చువాలిటీ అంతా తన లోనే పుట్టి పెరుగుతోందనుకునే మామగారి సవాలు.

'ఇదుగో కోడలుపిల్లా .... ఒక్కగానొక్క కొడుకూ, కోడలూ...అచ్చటా ముచ్చటా తీరాలని ఎంతో ముచ్చటపడుతున్నాను. ఏదో పెద్దదాన్ని కాబట్టి నామాట వినాల్సిన విధి నీకుంది. ఆడదానికి నోములూ వ్రతాలే ఇహపరాల కవసరం. కాని చదువు సంధ్యలు కావు'-చాదస్తపు అత్తగారి సబబైన కోరిక!

అందరి చాటునా మాటునా మెలగవలసింది కాబట్టి అన్నిటికీ సరేనంది విజయ. మరీ ఈనాటి చదువుకునే పిల్లల్లో ఎక్స్ట్రీమ్ టైప్‌కి కాకా మోడరేట్ టైప్‌కి చెందినదవటంమూలాన ఇంట్లో అందరి సంతృప్తీ తన కవసరమే ననుకుంది విజయ.

నలుగురూ తనని అదృష్టవంతురాలవంటారు: తనూ అనుకుంటుంది. అత్తమామలు మంచివాళ్లు. భర్త మంచితనం అందర్నీ మించిందే. పి. హెచ్ డి చదువుతున్నాడు. అంతా బాగానేవుంది. అందరూ సంస్కారం ఉన్నవాళ్ళే. ఈ సంస్కారాల మధ్యలోనే తన కేదో వెలితిగా కనిపిస్తుంది. అత్తగారి ఆదరణలలో లోపం లేదు. ఆవిడ తన చదువుకు భంగం కలిగించదు. కారణం లేకుండా కసిదీర్చుకోవాలనే మూర్ఖత్వం లేదు. తన మాట జవదాటనంతవరకూ, తన ఆజ్ఞలని పొల్లుపోకుండా నెరవేర్చినంతవరకూ ఆవిడ చాలామంచిదే. పెద్ద ముత్తైదువు, తానేవంటే ఏం బాధపడుతుందో! పోనీ చాతనైనంతవరకూ ఎవ్వరికీ కష్టం కలిగించటం తన కిష్టంలేదు. కాని ఈ వివిధ సంస్కారాల ఒత్తిడిలో తానెంతగా నలిగిపోతోందో గుర్తుకి వచ్చినప్పుడల్లా బావురుమనా లనిపిస్తుంది. తన మనస్సు అత్తగారి కడ్డు చెప్పలేదు.

హృదయం భర్తకి కొదవలేదు. మధ్యలో తనకి చంటిపిల్లతంటసం! ఎందరు పెళ్ళైనవాళ్లు ఏ బాదరబందీ లేకుండా సుఖంగా ఉండటంలేదు? భగవంతుడికి కూడా తన మీద కసే కాబోలు! తన సాధక బాధకాల్ని గురించి యోచించేవాళ్లు లేరు కాని ఎవరి అవసరాలు కోరికలూ వారికి తీరాలి! ఎంత స్వార్థం?!!...

విజయకి పుట్టింటి కోమారు వెళ్ళాలనుంది. కాని పంపించేవాళ్లుంటేగా!... అత్తారిళ్లల్లో కోడళ్లకి చదువు చెప్పించటం వాడవాడా అనుకుంటున్న మాటల్లో కేవలం తన అదృష్టం అయినా అది తనకు దురదృష్టంగానే వుంది! మొన్న శ్రావణ మాసం నోములకి తనని పంపించమంటూ తల్లి స్వయంగా వస్తే చదువుకి భంగం కాబట్టి పనేమీ వల్లకాదన్నాడు మాధవరావు. మహా తనిక్కడుండి పొడిచేస్తున్నట్టు! ఎంత 'వద్దమ్మా......నువ్వెళ్లి చదువుకో'...అని అత్తగారన్నా అది మాటవరసగానే వుంటుంది గాని పుట్టింటో అమ్మన్నట్టుంటుందా? ఆవిడ పని చేస్తూన్నంతసేపూ ఏదో తనూ చేస్తూ కూడా వుండాలే గాని పుస్తకం పట్టుకుని కూర్చోలేదు. అత్తసేవా, భర్తసేవా' చంటిదాని సేవా చేశాక ఇంక తనకి చదువుకోవాలంటే విసుగొస్తుంది...కాని తనకి చదువు మీద యిష్టం లేకనా?...

విజయ పాపని నిద్రపుచ్చుతోంది. మాధవరావు వచ్చాడు 'హల్లో మైడియర్' అంటూ. ఎప్పుడూ హుషారుగానే వుంటాడు. ముచ్చటైన మనస్తత్వం అతనిది. విజయ కావేళ చిరాగ్గా వుంది. ఎలాగైనాసరే తన దృఢనిశ్చయం అతనితో చెప్పెయ్యాలి. మాధవరావు నిద్రపడుతున్న పిల్లని లేవదీసి కూర్చోపెట్టి నవ్విస్తున్నాడు చక్కిలిగింతలు పెడుతూ. 'రేపట్నుంచి కాలేజీ మానేస్తున్నాను' అంటూ పరీక్షగా చూసింది అతనివైపు. కాస్సేపటివరకూ వినిపించనట్టుగానే ధోరణి మారనేలేదు. అబ్బ! ఎంత నిర్లక్ష్యం? విజయకి కోపం వచ్చింది.

'ఏం కథ? పాతపాటేనా? లేక ఏమైనా కొత్త ఆటంకాలా?'...అతను చిరునవ్వుతోనే అంటాడు ఏదన్నా. తనలో భుగభుగ మంటుంది. 'పాతదో కొత్తదో... నేనీ చదువుతో వేగలేను. ఇన్ని వ్యాపారాలు ఒక్కసారిగా చెయ్యడానికి నేనేం సవ్యసాచినికాను. మీ నవీనత్వానికీ అమ్మగారి ఛాందసానికీ పొత్తు కుదరదు. నిన్నటికి నిన్న పూజా పేరంటాల్లో గడిచిపోయిందా? చదివేందుకు తీరికేదీ! ఇవాళ





పెన్స్ బూడిదయింది. ఇల్లా చదివితే నేను పాసుకాలేను'—చక్కిలిగింతలో పక్కున నవ్వింది పాప. గుర్రుమని చూసింది విజయ. పక్కున నవ్వేడు మాధవరావు. 'ఎవరికీ లేని బాధ్యతలూ బరువులూ నువ్వే మోస్తున్నావు కాబోలు. అందరూ ఎల్లా చదువుకుంటున్నారో చెప్పగలవా చకోరాక్షీ!' ఎంత అవహేళన! అభిమానం ముంచుకు వచ్చింది. 'చదువుకోకపోతే ఈనాడు సంఘంలో సభ్యతా, మర్యాదలుండవ్!' మాధవరావన్నాడు తిరిగి. రేపు నేను పి. హెచ్ డి. చేశాక నా భార్యవైన నువ్వు విదుషివి కాకపోతే నాకు తలవంపు' మాధవరావులో లేని గాంభీర్యం, కరకుతనం తొణికిసలాడేయి. విజయకి పట్టరాని కోపం గట్లు తెంచుకుంది...'ఏమైనాసరే రేపు నేను కాలేజీకి పోవటంలేదు. నా బాధ్యతలు బరువుల విషయం ఒకళ్లు చెప్పవలసినవి కావు. ఆ కష్టసుఖాలు నాకు తెలుసు' ఉద్రేకంగా అంది విజయ.

రెండు రోజులు పట్టుదలగా కాలేజీ మానేసింది. ఈ రెండు రోజులూ ఒక్క మాట కూడా మాట్లాడించలేదు మాధవరావు. తను అపరిమితంగా ప్రేమించే విజయా అనే పిలుపు పతని నోటినుంచి తను వినలేదు. విజయ మానసికంగా చాలా బాధపడింది. దానికి తోడు రెండో రోజున కాబోలు మధ్యాహ్నం అత్తగారందుకుని 'అంత డబ్బూ కట్టి, పుస్తకాలూ అవీ కొని వాడంత ముచ్చటపడుతూంటే మధ్యలో నువ్వు చేసే నిర్వాకం ఇదటే? అంది. ఈ మాటలు విజయ మనస్సును మరీ కలవరపరిచాయి. తనేం చెప్తే వీళ్లకర్థం అవుతుంది? ఎదురు తిరిగిందన్న పేరుమాత్రం తనపరం అవటం తప్పిస్తే!...మర్నాడు తాను తిరిగి కాలేజీకి సిద్ధంఅయ్యాక తిరిగి 'విజయా!' అన్న పిలుపు భర్తనోటినుంచి వింది. ఆ ప్రేమ, ఆ లాలనే, తనకు పరమార్థంగా ఉన్నప్పుడు తన ఇష్టప్రకారంగా ఏపని చేయకలుగుతుంది ఆడది? స్త్రీ హృదయం రీతే అంత!!...ఆ అభిమానం విజయ పుస్తకం పుచ్చుకున్నప్పుడల్లా వెన్నాడుతూనే వుంది.

పరీక్షల్లో ఏమంత తృప్తికరంగా రాయలేకపోయింది. అయినా పాస్ ఎగ్జామినేషన్ కాబట్టి ఫరవాలేదనుకున్నారు. కాని ఫలితాలు తెలిసిన రోజున తనపేరు నోటీసు బోర్డుమీద లేదు. మొదట ఏ కాస్తో బాధించినా, ఆతర్వాత తనను బాధించలేకపోయిందా విషయం! మొదటి సంవత్సరమే తను ఫెయిలైంది. కాబట్టి ఇక చదువుకోమని బలవంతం చెయ్యరు. ఏ బాదరబందీ లేని సుఖజీవులకిగాని తన కెల్లా వస్తుంది చదువు? అయినా తను ప్రయత్నించినా విఫలం అయితే దానికి బాధ్యత తనది కాదు.

అత్తగారు విని ఊరుకుంది. ఒక్కటే మాటంటుంది ఎప్పుడన్నా. 'ఆ....సంసార్లకేం చదువులు వస్తాయి' అని. వీళ్ళకి ఉండేది ఒక్క నాలుక కాదు కాబోలు! విజయకి ఒళ్లు మండింది. 'బాగానే రాశావన్నావు కదమ్మా! ఏంచేతపోయిందో?...' మామగారు యాధాలాపంగా వేశారు ప్రశ్న. విచారపడుతూన్నట్టు విజయ నటించిందంటే నిజమే. మొండి సంతృప్తేదో తన నానందింపజేస్తోంది. ఇకమీద అప్పుడప్పుడు అత్తగారికి తనమీదకలిగే అసంతృప్తి లేకుండా సంచరింపవచ్చు. టైముకు రావాలన్న మామగారి ఆజ్ఞకి తను బద్ధురాలై ఉండక్కర్లేదు ఈపైన. పాపాయి సేవకి రోజంతా అర్పించవచ్చు...పాపం! అప్పుడప్పుడు ఇంట్లో వాళ్లమీద కలిగిన విసుగును వెలిబుచ్చేందుకీ పాపే దొరికింది! నిజంగా తానెంత నిర్దయగా ప్రవర్తించింది కొన్ని కొన్ని సమయాల్లో?

విజయ పాపమీద ముద్దులవర్షం కురిపించింది. సంగతి తెలిశాక మాధవరావన్నాడు "ఎప్పుడూ చదువొద్దో అని ఏడవటం తప్ప మనస్సుంచి చదివితేగా పాసవడానికి! చదివే అవకాశాలేని వాళ్లు చదువో అనేడిస్తే అది వున్న నీ ఏడుపిది!" అని మాధవరావు కంఠకోపం ఎప్పుడూ రాలేదు. విజయకి ఆశ్చర్యం కలిగింది. నిజంగా తను మనస్సుంచి చదవకపోవటం మూలాన్నేనా పాసుకానిది? 'బహుశా సెలవులయ్యాక రీఎగ్జామినేషన్ ఉంటుంది!" మళ్ళీ అన్నాడు. విజయ మనస్సులో రైళ్లు పరిగెట్టేయి. తను చదవాలని అంటాడు గాబోలు! 'ఉంటే ఉంటుంది. అయినా నాకవసరం ఏవిటి?' ముఖం మరోవైపు పెట్టి అంది విజయ.

'అంటే?' మాధవరావు కొంచెం గట్టిగా అన్నాడు. విజయ స్తంభించిపోయింది క్షణకాలం. తమాయించుకుని 'నే చదవననున్నాగా!' సాఫీగా అంది క్షణంసేపు మాధవరావు మౌనం ధరించాడు. 'విజయా!' అన్నాడు తర్వాత తన పిలుపులోవున్న కటువు అతనికి బహుశా తెలిసేఉండాలి. కళ్లల్లో చిరుహాసం నటిస్తూంటే విజయ అతన్ని చూసింది 'నువ్వు చదువుకోవాలి విజయా. కావలిస్తే సెలవల్లో నే కోచ్ చేస్తాగా .. ఫస్టియర్‌లోనే పాసుకాలేకపోయావంటే ఎంత అప్రతిష్ట!'—ప్రార్థనాపూర్వకంగా వున్నా అధికారపూర్వకమైన ధ్వని కూడ లీలగా వినిపించింది విజయ హృదయం పులకరించింది. అటూ ఇటూ ఎటూ తేలని ఏదో అనంత వేదన ఆమెని ముట్టడించింది. అత్తయ్య చాదస్తం, ఇంటిపనీ...చదువూ! చంటిపిల్లా?!...

'నువ్వు శ్రద్ధగా మనసుంచి చదువు ఎందుకు పాసవ్వవో నే చూస్తా'...

'తీరిక ఉండొద్దండీ! పనులు చెయ్యకపోతే ఆవిడ విసుక్కోవటం, నొచ్చుకోవటం!...ఆ పరిస్థితి నాకిష్టంలేదు!'...

'అయితే నన్ను నొప్పించటం నీకిష్టమే నన్నమాట!'

ఏం చెయ్యాలి తను? ఎవరిని అవునవాలి? ఎవరిని కాదనాలి? విజయకి దారుణమైన తలనొప్పి హఠాత్తుగా పట్టుకొంది. పాప కిలకిలా నవ్వింది. 'అవును...అందరి యిష్టానుసారం నడవాల్సింది నేనే'...ఆమె పెదవులు అస్పష్టంగా ధ్వనించాయి. పాపని విజయ ఒళ్లో పడేసి వెళ్ళిపోయాడు మాధవరావు. ఇద్దరివైపూ నిర్లిప్తంగా చూస్తూ కూర్చుండిపోయింది విజయ 

ముసలి తనంలో తిరిగి పెళ్లి చేసుకోవాలని ఒక పెద్ద మనిషికి బుద్ధిపుట్టింది. చేసుకోవలసిన అవసరం గురించి నచ్చచెపుతూ తన స్నేహితుడితో అన్నాడు.

"ఈ గుక్కెడు ప్రాణమూ పోతే కళ్లు మూసేటందుకైనా ఎవరన్నా ఉంటే మంచిది కాదూ?"

"నేనూ ఆ ఉద్దేశ్యంతోనే రెండు సార్లు పెళ్లి చేసుకున్నాను కాని వాళ్లిద్దరూ నా కళ్లు విప్పారు."



# బొమ్మరిల్లు

## పడవల పందెం

'కవి రావు'



కాల్వలో వేతు నా
కాగితపు పడవ,
ఖండఖండాలెల్ల
గాలించి రాగ?
కాల్వలో వేతు॥

నా యూరు, నా పేరు
వ్రాయింతు దానిపై
నావ చూడంగాను
నా గొప్ప తెలియాలి
కాల్వలో వేతు॥

మా తోటలో మంచి
మంచి పువ్వులు కోసి,
ఎన్నెన్నొ దేశాలు
ఎగుమతులు చేయాలి
కాల్వలో వేతు॥

ఏ రేవు చూచినా
నా పడవలే నిల్చి
'మన పేరు లోకాల
మార్మోగిపోవాలి
కాల్వలో వేతు॥

అడుగడుగో ఆ నీలి
ఆకాశమార్గాన
తెల్లమబ్బులు లేచ
తెరచాప లెత్తుగాని
కాల్వలో వేతు॥

వాలుగాలికి వాని
వదలినా డవ్వడో
పందెగాడొకడు నా
పడవల్ని చూచీ
కాల్వలో వేతు॥

మబ్బు పడవలకంటె
దబ్బుదబ్బున పోయి
మిన్ను మన్నుకు తాకి
యున్నచోటికి పోదు
కాల్వలో వేతు॥



# వాళ్ళూ, నేనూ

(29-9-54 తేదీ సంచిక తరువాయి)

ఇంట్లోకొచ్చేసరికి అమ్మ కేకలు! "చదువుకోరా అంటే విని పించుకోడు - అన్నానికి రాడు - వెధవా వెధవ స్నేహాలూనూ" అంటున్నది

"ఏంరా - దెబ్బలు కావాలే మిట్రా?" అన్నాడు మా అన్నయ్య. మాట్లాడకుండా భోజనానికి పోయి-ఏదో తినేసి పుస్తకం పట్టుకుని కూచున్నాను. వొఖ పేజీ - వొఖముక్క, ఒక అక్షరం బోధ పడలేదు. ఏదో ఆలోచన. పుస్తకం చేతిలోవుండి ... ఆలోచిస్తూవుండిపోయాను ... టికి వీపు మీద 'ధన్న' మని గుద్దు పడ్డది.

'అమ్మో' అన్నాను.

"వెధవా - చదవరా అంటే ఇదా? వెధవ పరధ్యానం నువ్వూనూ" అంటూ అన్నయ్య మరోటి కొట్టాడు. అమ్మ కూడా తిట్టింది. అన్నయ్య రెండు మూడు సార్లు 'పోయి చావరాదూ' అని కూడా అన్నాడు.

"నీ తోడిపిల్ల - ఆ కాంతను చూసి బుద్ధి తెచ్చుకో రాదూ? సిగ్గు, లజ్జ వుంటేగా" అన్నది అమ్మ.

"పోయి బస్‌స్టాండుదగ్గర మూటలు మోసుకో" అన్నాడు అన్నయ్య. 'అట్లాగే' అనుకున్నాను.

ఆ రాత్రి నిద్రపట్టటం అతి కష్ట మయి పోయింది. ఈ ఇంట్లోవుండి ఈ బాధలు పడుతూ ఈ తిట్లు తింటూ వుండే కంటే - ఆ బస్టాండు దగ్గర మూటలు మొయ్యటమే ఉత్తమ మనిపించింది. లేకపోతే ఏ నూతిలోనో దూకి చస్తాను. ఈ

◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆

## రావి కొండలరావు

◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆

ఇంట్లో మాత్రం వొఖ క్షణం వుండను!

పొద్దున్నే లేచి మొహం కడుక్కుని కాఫీ అన్నా తాక్కుండా బయట పడ్డాను. అన్నయ్యను చూసే సరికి చంపేద్దా మన్నంత కోపంవొచ్చింది. బుచ్చిగా డెక్కడ వున్నాడో! రాత్రి ఎక్కడ పడుకున్నాడో! త్వరత్వరగా తోటలోకి పోయాను. అక్కడ వాడు వున్నాడు.

"బుచ్చీ" అన్నాను.

"ఆఁ - రా" అన్నాడు.

"రాత్రి ఎక్కడ పడుకున్నావ్ రా?" అనడిగాను.

"కోవెల్లో. ముందు తోటలోనే పడుకుందా మను కున్నాను గాని వొఖణ్ణి - భయంవేసింది. నాకు దయ్యాలన్నా ఏమన్నా భయం లేదనుకో - ఐనా ఎందుకో అనిపించింది. వొకవేళ దయ్యాలున్నా ఆంజనేయస్వామికోవెల్లోకి రావు. అంచాత అక్కడే పడుక్కున్నాను. తెల్లారి లేచి ఇక్కడ కొచ్చేశాను. ఆఁ - కాఫీ తాగావా?" అనడిగాడు.

"గాడిదగుడ్డు. కాఫీవొకటి ఆ యింట్లో" అని జరిగిన సంగతంతా చెప్పాను. అంతా విని - "అంతేరా ఈ పెద్దవాళ్లు - పద ఎక్కడికన్నా పోదాం. ఇంకోవూరు పోయి మనం కూలిపని చేసుకున్నా అడిగే వాడు ఎవడూ వుండడు."

"నిజం"

"రాత్రి నువ్వుయిచ్చిన డబ్బులు ఇంకా అట్లాగే వున్నయ్ పద పోయి కాఫీ తాగి వొద్దాం."

ఇద్దరమూ పోయి కాఫీ తాగి తోటలోకి వొచ్చాం. కాస్సేపటికి వెంకట్రావూ తంబిగాడూ పుస్తకాలతో దిగబడ్డారు!

"  - ఓరేయ్ - మేమిద్దరం ఈవూరు విడిచిపెట్టి పోతున్నాం"

"ఆఁ!" తంబిగాడికి అంత ఆశ్చర్యం వేసింది.

"అవున్రా. బుచ్చీ నేనూ పోతున్నాం. మీరు జాగ్రత్తగా వుండండి. మన సంగతులు మాత్రం ఎక్కడా అనకండి. ఒకవేళ ఎవరన్నా మా గురించి అడిగితే 'మాకు తెలీదు' అని చెప్పండి"

"నిజం?"

"నిజమేరా. పోతాం" అన్నాడు సీరియస్‌గా బుచ్చి. తంబిగాడికి కళ్లలో నీళ్లు తిరిగి నంత పనయింది.

"ఓరే... నేనో..." అన్నాడు నెమ్మదిగా.

"నువ్వెందుకురా? వొద్దు"

"అబ్బా. పదండ్రా నేనూ వొస్తాను. నాకు మాత్రం ఈవూరు ఏం బావుందని?"

"నీయిష్టం" అన్నాడు బుచ్చి.

"ఓరే - అందరూ పోతుంటే నేను మాత్రం వుంటాన్రా? నేనూ వొచ్చేస్తాను" అన్నాడు వెంకట్రావు.

నాకు ఆశ్చర్యం వేసింది. వెంకట్రావు ఇంత మాట అంటాడని నేనూహించ లేదు.

"నువ్వా వొచ్చేయ్‌రా. మేం లేక పోతే నువ్వెట్లా వుండగలవ్? ఐనా ఆ మేస్టారి చాత దెబ్బలు తినటం ఆఖర్మమేమిటి నీకు" అన్నాడు తంబి.

"ఓరే వెంకట్రావ్! నువ్వెందు మీ వాళ్లు వెతుక్కుంటారు"

"వాళ్లేం వెతుక్కోరు. నేనెట్లాగన్నా ఇంట్లోంచి పోవటమే వాళ్లకు కావల్సింది." అన్నాడు. ఇది కొత్త అని నాకు తెలుసు. మేము ఎంత చెప్పినా వాడు వినిపించుకో లేదు. ఆఖరకు నలుగురమూ కలిసి పోవటానికే నిశ్చయించు కొన్నాం.

"మనకు ముందు కొద్దిగా డబ్బుండాలా" అన్నాడు బుచ్చి.

"నా దగ్గిర మూడు రూపాయిలున్నై" అన్నాడు వెంకట్రావు ఛటాలున.

"మూడు చాలవు కానీ - ముందుగా మనం ఎక్కడన్నా దొంగతనం చెయ్యాలి"

"దొంగతనమా?" అన్నాను.

"అవును ఇప్పుడే దారి వెంబడి కొంతదూరం పోతే అక్కడ నల్లటి రాతి కొండలు కనుపిస్తాయి."

"అవును. అక్కడ ఎలుగుబంట్లు వుంటాయని చెబుతారు" అన్నాను.

"ఏడిశాయి గాని - అక్కడకు పోవాలి మనంముందుగా" అన్నాడు బుచ్చి.

"పోతే"

"పోతే - అక్కడే వొంటరిగా అనేకమంది పల్లెవాళ్లు తిరుగుతూ వుంటారు. కొండరాళ్లమధ్య మనం పొంచి వుంటాం. మనిషిరాగానే అడ్డగించి చంపెయ్యటం - డబ్బులాక్కోటం - వాళ్ల దగ్గిర బాగా డబ్బుంటుంది."

"అమ్మోయ్" అన్నాడు వెంకట్రావు.

"ఓరే - అటువంటి కేకలు లాభంలేదు. ఇహ మీదట మనం అన్నీ ఇటువంటి పన్లే చెయ్యవలసి వుంటుంది. ఆ డబ్బు వొచ్చిందంటే మనం అదిపట్టుకుని ఏ కలకత్తావో పోతాం. అక్కడ పేద్ద మేడలుంటాయి - బోలెడన్ని వుద్యోగాలుంటాయి - మనం అక్కడ జేరతాం. కావల్సినంత డబ్బు జీతంగా యిస్తారు. మనకు మేడలూ కార్లూ - మనం అక్కడున్నట్టు తెలియగానే మన వాళ్లు పరుగెత్తుకొచ్చి మన కాళ్ల మీదపడి క్షమించ మంటారు" అన్నాడు బుచ్చి.

"బావుందిరా" అన్నాం అందరం.

"బయల్దేరుదామా?" అని లేచాడు వాడు.

అందరమూ లేచాం.

"ఓరేయ్ - కొద్దిగా టిఫిన్ తినేసి పోదాంరా" అన్నాడు వెంకట్రావు. బాగానే వుంది. మూడు రూపాయలకు సరిపోయేట్టు నలుగురమూ కడుపునిండా తినేశాం. హోటలు దాటి చాలా దూరం వొచ్చేశాం.

"ఓరే - ఇది చూశారా?" అన్నాడు బుచ్చిగాడు. వాడి చేతిలో నిగనిగ లాడుతూ ఓ పర్సు కనుపించింది!

"ఎక్కడిదిరా?" అన్నాం ఆశ్చర్యంగా.

# వాళ్లూ, నేనూ

బుచ్చి బాబు చుట్టూ చూసి, చాలా గర్వంగా "నా పక్కన ఆ నల్ల లావాటి వాడు కూచున్నాడు కదూ హోటల్లో-వాడి జేబులోది. అందుకే ముందు నేను త్వరగా బయట పడ్డాను." అన్నాడు అసాధ్యుడల్లే వున్నాడు వీడు!

"దొరక లేదురా? " అన్నాడు తంబి.

"సీ మొహాం. దొరికి పోతే ఇంకే ముంది? ఆఁవుండండి" అని బుచ్చి గాడు వొంటేలు పోసుకుంటున్నట్టు రోడ్డు ప్రక్కకుపోయి - డబ్బు జేబులో పెట్టుకుని - ఆ పర్సు కాలవలో పారేసి వొచ్చాడు.

"ఎంత వుందిరా?" అనడిగాను.

"లెఖ పెట్టలేదు. చూద్దాం" నడుస్తూ చూశాం. పదహారు రూపాయలూ తొమ్మిదలణా చిల్లరా వున్నయ్!

"ఇంకేం లేవురా?" అన్నాడు తంబి.

"అదేవత్తో వొక ఆడదాని ఫోటో వొకటుంది. సినిమాస్టార్ అనుకుంటాను. ఇంకేదో కాగితాలున్నయ్. అవన్నీ ఈపాటికి సముద్రంలో కలిసి పోయి వుంటాయిలే" అందరం నవ్వు కున్నాం. గొప్ప వుషారుగా వుంది!

"వొరే - ఇప్పుడే వొస్తా ముండండి." అని పరుగెత్తాడుబుచ్చి. మేం అట్లాగే నించున్నాం. మా వాళ్లు ఎవరన్నా కనబడతా రేమోనని భయం. అంచాత రోడ్డు ప్రక్కగా మాట్లాడకుండా నించున్నాం. కాస్సేపటికి బుచ్చిగాడు పరుగెత్తుకొచ్చాడు.

"పదండ్రా పోదాం" అన్నాడు. బయల్దేరాం.

"అసలు ముఖ్యమయిన వస్తువులే మరిచి పోయినాం ఇవిగో చూడండి." అని బుచ్చి గాడు జేబులోంచి తీసి వో పొడుగాటి చిన్న కత్తీ, లావుపాటి తాడూ చూపించాడు - "ఆ డబ్బులో ఇవి కొన్నాను"

"బావుందిరా" అన్నాడు సంతోషంగా తంబి గాడు.

"వొరేయ్-ఈపుస్తకాలొకట్రా మోత-" వెంకట్రావుకు బరువయి పోయి నట్టున్నయ్

"అవును. ఇంకా ఎందుకూ? పారేయండి." అంటూ తనే తీసుకునిబుచ్చి గాడు ఇద్దరి పుస్తకాలూ కాలవలో పారేశాడు. పెన్నూ పెన్సిలూ ఎందుకన్నా మంచిది వుంచమన్నాడు.

మూడు నాలుగు మైళ్లు చాలా వుత్సాహంగా నడిచి ఆ నల్లరాతి కొండల దగ్గరకు చేరు కొన్నాం. అప్పటికి పదో పదకొండో గంటలయి వుంటుంది. కొండలు చాలా ఎత్తున కనుపించినై రోడ్డు పక్కగా దిగికొంతదూరం అడ్డంగానడవాలి నల్లటిరాళ్లూ - బండరాళ్లూ - అక్కడక్కడ చెట్లూ - దూరంగా నది ప్రవహిస్తున్నది. చాకలి వాళ్లెవరో అక్కడ బట్టలు వుతుక్కుంటున్నారు. ఆ చుట్టుపట్ల అంతా మరింకెవడూ మనిషి కనిపించలేదు. రోడ్డుమీద దూరంగా వోబస్సు వొస్తూ కనిపించింది.

"మనం కలకత్తా పోయేవరకూ ఇహ మనఇల్లూ కాపురం అంతా ఇక్కడే" అన్నాను.

"భలే భలే" అని గెంతాడు తంబి.

"ఎందుకురా ఇక్కడ కాపురం? డబ్బు చిక్కేవరకేగా. ఈక్షణాన్నే మనకు డబ్బొచ్చిందనుకో - కలకత్తా ఇప్పుడే పోతాం అన్నాడు బుచ్చి.

"వొరే - బొంబాయి పోతేనో? అని వో ప్రశ్న వేశాడు తంబిగాడు.

"ఎక్కడి కన్నా పోతాం. కలకత్తాలో కొన్నాళ్లుండి బొంబాయి పోదాం" అన్నాను.

రోడ్డు ప్రక్కగాదిగి కొంత దూరం నడిచి కొండల కిందికి చేరుకున్నాం.

"వుండండి. ఇవి ముందు తినండి. తర్వాత కొండ ఎక్కొచ్చు" అని బుచ్చిగాడు మనిషికి రెండేసి పిప్పరమెంట్లు ఇచ్చాడు.

"ఎప్పుడు కొన్నావురా? " అని అడిగాడు వెంకట్రావు చప్పరిస్తూ. బుచ్చిగాడు మాట్లాడలేదు. కొండ నిండా ముళ్లపొదలు. తంబిగాడికి తప్ప మిగిలిన వాళ్లకు జోళ్లున్నయ్. వాడికి ఎక్కటం మహా కష్టంగా వుంది. మాటి మాటికీ ముళ్లుగుచ్చుకుంటూ నే వున్నై.

"వొరేయ్ వుండ్రా నువ్వు. నేను పైకిపోయి నా జోడువిసుర్తాను. అది వేసుకుని వొద్దువు గాని" అన్నాడు బుచ్చి మంచిఆలోచనే. వాడూ వెంకట్రావూ ముందు ఎక్కారు. బుచ్చి ఎక్కినంత

నేర్పుగా వాడు ఎక్కలేక పోయినాడు. తర్వాత బుచ్చిగాడు జోడు తీసి కిందికివిసిరాడు. వొకటి మధ్యలో పడిపోయింది - వొకటి కింద పడ్డది. నేను ఎక్కి మధ్యలో పడ్డ దాన్ని మళ్ళీ విసిరాను. తంబిగాడు ఆ జోడు వేసుకుని ఎక్కాడు. మేం కూడా కష్టపడుతూ - జారిపోతూ జారిపోతూ ఎక్క గలిగాం.

"తాడుకాస్త పెద్దదయితే - ఈ చివర పైనకట్టి ఆ చివర కిందకట్టి దాన్ని పట్టుకుని సులభంగా ఎక్క గలిగి వుందుము వెధవతాడు - మనిషికి వురి పొయ్యటానికే గాని మరెందుకూ పనికిరాదు" అన్నాడు బుచ్చి.

కొండ రాళ్లన్నీ తిరిగాము. మరి కాస్తపైకెక్కిచూస్తే మావూరంతా కనబడ్డది. ఎవరన్నా మమ్మల్ని చూస్తా రేమోనని రాతి ప్రక్క నుంచి చాటుగా నించుని చూశాం. కొండరాళ్లన్నీ చాలా భయంకంగా వున్నై. అక్కడక్కడ గుహ లున్నై. ఎలుగుబంట్లు వాటిల్లోనే వుంటా యంటారు. ఐతే బుచ్చిగాడు వాటిల్లోకివెళ్లి వొచ్చాడు. వాడికి ఏ ఎలుగుబంటీ కనబడలేదుట - గబ్బిలాలు మాత్రం వున్నాయిట. రాళ్లపైనుంచి అట్లాగే నడిచి అటు వెళ్లాం ముందుగా బుచ్చిగాడు దారి తీస్తున్నాడు. కొంత దూరం వెళ్లే సరికి 'భేష్' అని అరిచాడు వాడు.

"ఇక్కడ దొరికిందిరా మాంఛి ప్లేసు బ్రహ్మదేవుడు కనుక్కోలేడు రండి" అన్నాడు. అదొకకొండ గుహాల్లే వుంది. లోపల చాలా చీకటిగా వుంది.

"వుండండి - తమాషా చూద్దురు గాని." అని గుహాలో దూరాడు. లోపలకు పోయాడు. పోనుపోను ఆ చీకట్లో వాడు కనిపించనే లేదు! కాస్సేపటికి మా ప్రక్కనున్న వో సందుగుండా బయటకొచ్చి 'ఆహ్హాహ్హాహ్హా' అని నవ్వాడు.

"అరెరే - సొరంగం" అని చప్పట్లు చరిచాడు తంబి.

"వొరే - మేమూ వొస్తాంరా" అన్నాను.

"వూఁ పదండి"

"వొరే నువ్వ యిట్నుంచి రారా. - మేం అట్నుంచి వొస్తాం" అన్నాడు తంబి.

"అది లాభం లేదురా. కొద్ది దూరం పోయేటప్పటికి అక్కడ వంగి వెళ్లాలి. వొఖమనిషి. పట్టడమే కష్టం" అన్నాడు బుచ్చి. వాడు ముందూ - వెనక మేమూ గుహ లోకి జొరబడ్డాం. లోపలంతా చీకటి. ఏదో వాసన. భయంకరంగా వుంది. పాములే వుంటాయో - ఏమిటుంటాయో అనిపించిందినాకు. ఐతే గట్టిగా అనలేదు. వూపిరి బిగించి అట్లాగే నడిచి ఇవతలకు వొచ్చాం. రాగానే తంబీ వెంకట్రావూ సంతోషంగా కేకలు వేశారు.

"వొరేయ్ ఈసారి ఇట్నుంచి అటు వొస్తావ్రా" అని వెళ్లాడుతంబి గాడు.

"పదరా కూచుందాం" అని గుహ మొదట్లోకిపోయి కూచున్నాం. ఎండ తీక్షణంగా వుండటం చేత - అక్కడ చల్లగా వుంది నది మీదనుంచి నీటిగాలి బాగా వొస్తున్నది. బుచ్చిగాడు చొక్కా విప్పేసి కూచున్నాడు. వెనకనుంచి తంబిగాడూ వొచ్చి కూచున్నాడు.

వొరే - దాహంగా వుందిరా" అన్నాడు వెంకట్రావు.

ఆ నదికి పోయి తాగిరండి" అన్నాను.

అవున్రా - నాకూ దాహంగా వుందిరా" అని లేచాడు తంబి. ఇద్దరూ బయల్దేరారు.

"నేనూ తాగాలిరా" అనిబుచ్చి గాడు కూడా లేచాడు.

"ఐతే నేనూ వొస్తానుపద" అని నేనూ బయల్దేరాను. కొండ దిగి నదికిపోయి నీళ్లుతాగాము. ఈ సారి ఇటు వేపు కొండదిగటం కష్టంగా లేదు. ముళ్లుకూడా లేవు. ఎక్కటమూ సులభంగానే ఎక్కిపోయి మళ్లీ మా చోటులో కూచున్నాం. బుచ్చి చొక్కావిప్పి రాతిపగులులో కత్తి గుచ్చి - దానికి చొక్కా తగిలించి "వొరేయ్, మనుషు లెవరూ రావటంలా?" అన్నాడు రాజల్లే. అందరం చూశాం కాని ఎవరూ వొస్తున్నట్టు కనిపించ లేదు. రోడ్డు మీద బస్సులూ బళ్లూ తిరుగుతున్నాయ్.

కాస్సేపటికి కొండకిందకి గొర్రెల్ని కాసుకుంటూ వొకడొచ్చాడు. వాడికి వొంటి మీద కట్టుకున్న చిన్న గుడ్డ తప్ప ఇంకేం లేవు. వాణ్ణే చంపేయ్యాలంటారు తంబీ, వెంకట్రావు. 'వాడిదగ్గర ఏమీ వుండదురా' అంటే వినిపించు కోరు. ఇంకెవరూ మనుషులు రావటం లేదు. రోడ్డు మీద మనుషులు - వొంటరిగానే తిరుగుతున్నారు గాని. అక్కడకు వెళ్లి ఎట్లా చంపుతాం? కొండకింద




పెళ్లి బజారు —మహమ్మద్ సుల్తాన్ మొహియుద్దీన్ (14) నెల్లూరు.

# ★ వాళ్లూ, నేనూ ★

నుంచి మనిషి ఒంటరిగా పోవాలి- వాడి దగ్గర డబ్బుండాలి - ఐతేనే కాని సాధ్యంకాదు!

మరి కాస్సేపటికి వెంకట్రావు నిద్రలో పడ్డాడు. తంబిగాడు ఇంకే వన్నా సొరంగాలున్నయ్యేమో చూసొస్తానని వెళ్లాడు. నేనూబుచ్చి కాస్సేపు మాట్లాడుకున్నాం. బుచ్చి గాడికీ నిద్ర వొచ్చినట్టుంది. నేను మాత్రం ఆలోచించ సాగాను మేం ఇట్లా వొచ్చేశాం కదా మా వాళ్లు ఏమను కుంటున్నారు? ఈ పాటికి వెతుకుతూ వుంటారేమో! పాపం - పట్టు పరుపుల మీద పడుకునే వెంకట్రావు ఇప్పుడీ రాళ్లమీదే నిద్ర పోతున్నాడు. ఇక్కడికి ఏ మనిషీ రాడు - మాకు డబ్బురాదు - ఏం చెయ్యటం? గుండెల్లో దిగులు ప్రారంభమయింది. ఆకలి కూడా వేస్తున్నది. మంచినీళ్లు తాగితే తగ్గుతుందేమోనని లేచాను. తంబిగాడు

రొప్పుతూ వొస్తూ "వొరేపాముర" అన్నాడు. ఎక్కడన్నాను.

"అటు - వొకటి కాదు చాలా వున్నట్టున్నయ్. చూద్దామా?"

"ఎందుకురా? పద, మంచినీళ్లు తాగుదాం"

ఇద్దరం వెళ్లి నీళ్లుతాగాం. ఎండ చాలా తీవ్రంగా వుంది. వొంటి గంట ఐవుంటుంది. నెత్తి మాడుస్తున్నది.

"వొరే - నీకు ఆకలి కావటం లేదురా?" నెమ్మదిగా అడిగాడు తంబి.

"ఏం - ఎందుక్కావటం లేదూ? కాని... ఇంటిదగ్గర మన గురించి ఏమనుకుంటారో -"

"అవున్రా" అని ఏదో అనబోయి వూరుకున్నాడు. మా ప్రక్కనుంచి వో చాకలి మూట పట్టుకుని పోతున్నాడు. వాణ్ణి చంపేసి మూటలాక్కుని ఆ బట్టలు అమ్మేస్తే డబ్బొస్తుందన్నాడు తంబి. నేను నీరసంగా నవ్వాను. ఇసుకలో వాడికాళ్లు మాడినై! ఈసారి కొండ ఎక్కటం చాలా కష్టమయి పోయింది.

పదిహేను రోజులు తిండి మానేస్తే ఎట్లా వుంటుందో అట్లా వుందినాకు. నెమ్మదిగా ఎక్కాం. వాళ్లు చాలా నిద్రలో వున్నారు. మేము కూచుని బాతాఖానీలో పడ్డాం. ఐతే ఆ బాతాఖానీలో ఏమీ వుత్సాహం లేదు. పొద్దున్న వున్న సంతోషం అంతా ఏమై పోయిందో! మా 'కలకత్తాప్రయాణం' ఆమాటలన్నీ పోయి - కాఫీ హోటల్సు మీదికీ - ఇంటి మీదికీ పోయినయ్ మా మాటలు! కాస్సేపటికి "పట్టుకో - చంపు" అని నిద్రలో కేకలు వెయ్యటం మొదలెట్టాడు బుచ్చి. మాకు భయంవేసి లేపాం. వాడికో బ్రహ్మాండమయిన కలొచ్చిందట. అంచాత అట్లా కేక వేశా నన్నాడు. ఆ కలేమిటో చెప్పాడు గాని వినే వుత్సాహం నాలో ఎప్పుడో చచ్చింది!

"ఏంరా ఇంత వరకూ ఎవడూ రాలేదూ" అన్నాను.

"వొచ్చిందాకా ఇక్కడ వుండాల్సిందే" అన్నాడు బుచ్చి.

"మరి ఆకలి?" అని చూచాడు తంబి.

"నీ మొహం! ఆకలయితే అంతే. ఈ కాస్సేపటికే ఇట్లా ఐపోతే తర్వాత ఏంచెయ్యగలవ్? కావాలంటే డబ్బుంది - పోయి కొనుక్కుని తిను." అన్నాడు బుచ్చి.

అవును నిజమే. ఆ డబ్బు తీసుకుని పోయి కొనుక్కోవచ్చు. కాని - వూళ్లోకి పోవాలి! వూళ్లోకి పోతే మళ్ళీ యిక్కడికి రావటం అంటూ వుండదు. - పట్టుకుంటారు. పట్టుకుంటారా - ఏమో - తనివిరగడయి పోయిందని వూరుకోనూ వొచ్చు. ఏమయినా - వెళ్ళ లేదు వూరుకున్నాం,

మా మాటల్లో వెంకట్రావు ఎప్పుడు లేచాడో మేం గ్రహించ లేదు.

"వొరే - ఆకలిరా" అన్నాడు చిన్న పిల్లాడల్లే.

బుచ్చి వెకిలిగా నవ్వి "భరించాలి మరి" అన్నాడు.

"దాహం" అన్నాడు మళ్లీ.

"నీళ్లు తాగితే తగ్గుతుంది"

నేనూ వెంకట్రావూ నీళ్ళకోసం దిగాం. వాడు దార్లో చెప్పాడు - వాడికి ఆకలి చాలా తీవ్రంగా వుందట - ఇంటికి పోతా నన్నాడు!

"అప్పుడేన్రా?" అన్నాను.

"వొద్దురా - నాకు భయంగా వుంది"

"ఇంటికి వొఖడివీ పోగలవా?"

"వూఁ"

"సరే నీయిష్టం" అనేశాను.

కొండపైకి ఎక్కి వాళ్ళతో ఈ మాట చెప్పాను. బుచ్చి బాబు వాడికి ఎంతో చెప్పి చూశాడు. వాడు వినలేదు!

"చూశావా - మొదటవిన్నాను కాడు. సరేవెళ్లు. కాని మా సంగతి మాత్రం ఎవరితోనూ చెప్పకు."

"ఛస్తే చెప్పన్రా"

"వొట్టు"

"వొట్టు"

వెంకట్రావు బయల్దేరాడు. వాడు పోతుంటే నాకేమిటో అనిపించిది. వాడిమొహం ఇంకాస్సేపుంటే ఏడుపు లంకించేట్టుంది. వాణ్ణి సాగనంపటానికి నేనూ కొండదిగాను.

"వొరేయ్ - ఆకలి దంచేస్తోంది" అన్నాడు.

"ఇంటికి పోయి భోంచెయ్"

ఇంతలో ఖాళీగా - వాడి అదృష్టం అన్నట్టు. వో బండివొస్తూ కనిపించింది. నాకో ఆలోచన తట్టింది. వెంకట్రావు నడిచి వొఖడూ ఇంటికి పోలేడు. శక్తికూడా లేదు. ఆ బండి ఆపి ఎక్కమని ఇంటికి పోయాక డబ్బిచ్చేయమన్నాను.



బటానీల విందు

—సి. హెచ్. శివశంకర్, విజయవాడ.

"వొరే - కలకత్తా వెళ్లగానే వుత్తరం రాస్తారు కదూ?" అన్నాడు బండిలో కూచుని.

"వొ - తప్పకుండా"

వొరే - వొస్తే సెలవుల్లో ట్రయిన్‌లో వొస్తాను. వాళ్ళతో చెప్పు"

"అట్లాగే రా"

"వొరే - కొండమీద రాత్రి జాగర్తగా వుంటారు కదూ - అన్నట్లు - మీరు ఇక్కడున్నట్టు ఎవ్వరికీ చెప్పను నాకు అసలు తెలియనే తెలీదంటాను. వొస్తాను మరి..." అన్నాడు వుత్సాహంగా.

మా మాటలు విని బండివాడు మా యిద్దరికేసీ చిత్రంగా చూసి బండి తోలాడు. బండి బయల్దేరింది వాడు వెళ్ళిపోతూవుంటే అట్లాగే నిలబడి చూస్తూ వుండిపోయాను. నాకు చెప్పలేనంత దిగులేసింది. ఈ సారి కొండ ఎక్కటం చాలా కష్టమయిపోయింది మధ్యలో వొకటి రెండు సార్లు కూచోవాల్సి వొచ్చింది కూడా! నేనూ ఇంటికి పోతే బావుణ్ణని పించింది. ఇంట్లో మా అమ్మా అన్నయ్యా అందరూ గుర్తొచ్చారు. శాంత కూడా గుర్తొచ్చింది. నా గురించి ఏమనుకుంటున్నదో! కాఫీ వేళ కూడా ఐంది. ఎన్నాళ్లు ఇట్లా కాలక్షేపం చేస్తాం? -

నెమ్మదిగా ఎక్కాను. "వెళ్లిపోయాడ్రా?" అనడిగాడు తంబి.

"ఆఁ" అన్నాను

బుచ్చిగాడు లేచి బయటికొచ్చి చుట్టూ చూసి - "దీంతస్సాగొయ్యా వొఖడూ కనుపించ్డా" అన్నాడు. నేను అట్లాగే జేరబడ్డాను.

బాగా సాయంత్రమయిపోయింది నది వొడ్డున చాకళ్లందరూ మూటలు పట్టుకుని ఇళ్లకు పోతున్నారు. పక్షులు కూడా ఎక్కడినుంచో వొస్తూ గూళ్లకు పోతున్నయ్ చీకటి పడటానికి సిద్ధంగా వుంది. రోడ్డుమీద మనుషుల సంచారం కూడా తగ్గిపోయింది. నాకు భయం వేసింది. ఈ రాత్రి ఈ భయంకర ప్రదేశంలో - ఆకల్తో - ఎట్లా వుండటం?

"వొరేయ్ పోతాన్రా" అన్నాను లేచి నిలబడి జంకుతూ.

"ఎక్కడికి? అన్నాడు బుచ్చి.

"ఇంటికి. నన్ను ఆపకు. నాకు చాలా దిగులుగా వుంది. భయంగా కూడా వుంది. ఇంటికి పోదాం పద. శ్రద్ధగా చదువుకుందాం - మేష్టారు ఎందుకు కొడతారో - ఇంట్లో ఎందుకు తిడతారో - చూద్దాం" అన్నాను గట్టిగా. వాడు వెకిలిగా నవ్వాడు. "నేను రాను నీయిష్టం. వీడు కూడా వొస్తాట్ట - ఇద్దరూ పోండి" అన్నాడు దర్జాగా.

"నువ్వొఖడివీ వుంటావురా?" అన్నాడు తంబి.

"నిక్షేపంగా"

"వొరేయ్ - వీలయితే ఇంటికి పోయి భోంచేసి మళ్ళీ వొస్తాలే" అన్నాడు తంబి. మేము బయల్దేరాం!

"బుచ్చీ... నామాట విను... నువ్వు కూడా" అన్నాను.

"ఛష్... రేపొద్దున్న ఏ కలత్తాలోనో ఏ బొంబాయిలోనో వుంటే అప్పుడు చూట్టానికి మీరే వస్తారు" అని వాడి గుహలోకి చొచ్చుకుపోయాడు!

"సరే నీ యిష్టం" అని దిగాం మేము దిగుతూవుంటే దూరంగా నక్కలకూతలు కూడా వినబడ్డయ్! అరే - వీడు ఎట్లావుంటాడు?

ఎట్లాగో కాళ్ళీడ్చుకుని వూరు చేరుకున్నాం. తంబి వాళ్ళింటికి పోయాడు. నేను యింటికొచ్చేసరికి వీధిగుమ్మంలో మా అమ్మ నించుని వున్నది. నన్ను చూడగానే ఏడుపొచ్చినట్టయింది! "చెప్పకుండా ఎక్కడికి పోయావురా?" అన్నది నెమ్మదిగా. నాకు మాటరాలేదు. లోపలకుపోయాను. స్నానం చేసి బట్టలు మార్చుకుని జరిగిన సంగతంతా అమ్మకు చెప్పాను. బుచ్చిగాడి సంగతిమాత్రం చెప్పలేదు. అంతా విని—"అదేం ఖర్మంరా! నీ మంచికోసమే కదుట్రా తిడతాము? సరే - అన్నానికి లే... నీకోసం అన్నయ్య పోలీసు రిపోర్టు కూడా ఇస్తానన్నాడు" అన్నది అమ్మ.

భోజనం చేస్తూవుంటే శాంత వొచ్చింది. నేను చూసి వూరుకున్నాను—ఏమీ మాట్లాడలేదు.

"ఎప్పుడొచ్చాడండీ" అన్నది అమ్మతో.

"ఇప్పుడే" అన్నది అమ్మ.

శాంత కూచుని "ఎక్కడికెళ్లావు?" అని అడిగింది.

"ఎక్కడికీ లేదు"

"మీ నలుగురిగురించీ స్కూల్లో ఎట్లా చెప్పుకుంటున్నారో తెలుసా? పాపం! మీమీద మాష్టారు ఎంతో జాలిపడ్డారు." అన్నది. భోజనం కానిచ్చి బయటికొచ్చి శాంతతో జరిగిన సంగతి చెప్పాను. కొండమీద దెయ్యాల్ని

(48-వ పేజీ చూడండి)

ఏ గ్రామమో చేరుకుని విశ్రాంతి తీసుకనేవారు. మణిలాలు రాత్రి నిద్రపోయేముందు పచ్చ ఉన్న పొట్లాం భద్రంగాఉందో లేదో జేబు తడిమి చూసుకుని మరీ పరుండే వాడు.

సర్వాణసింగు చాలా కలుపు గోలుతనం కలవాడు. దారిపొడు గునా తన హాస్యప్రసంగాలతో వాళ్లను నవ్విస్తూ, 'బలేవాడు!' అనిపించుకున్నాడు. వంటలోనూ, తక్కిన పనులలోనూ సాయపడుతూ తక్కినవాళ్ల కృతజ్ఞతకు పాత్రు డయాడు.

వాళ్లు ఆవిధంగా నాలుగు రోజులు ప్రయాణం చేశారు. ఐదో రోజు ఉదయం సర్వాణసింగు, 'ఆ కనపడే గ్రామంలో నా స్నేహి తుడు ఒకడు ఉన్నాడు. వాణ్ణి ఒక సారి చూసివస్తాను. మీరు నడుస్తో ఉండండి. సాయంకాలంలోగా వచ్చి కలుసుకుంటాను.' అని చెప్పి, వాళ్లని వదలి మార్గానికి ప్రక్కగా ఉన్న ఆ గ్రామం వైపు వెళ్లేడు.

ఆసాయంకాలం యధాప్రకారం వాళ్లు ఒక ఊరు చేరుకుని వంట ప్రారంభించారు. మణిలాలు ఒకచోట కూర్చుని, జేబులో ఉన్న పొట్లామును పైకితీసి, పచ్చను ఒక సారి చూడాలని బుద్ధిపుట్టి, పొట్లాం విప్పేడు.

ఆ పొట్లాంలో పచ్చ లేదు! దమ్మిడీ విలువచెయ్యని ఒక గులక రాయి మాత్రం ఉంది!

లాలుకు గుండె ఆగిపోతోన్న ట్లైంది. ఆతడు 'కొంపమునిగింద'ని గోల పెట్టేసరికి తక్కిన వర్తకు లంతా చేరి, 'ఏమిటి?' అని సంగతి తెలుసుకున్నారు.

'లక్ష రూపాయల పచ్చ!' అన్నాడు లాలు.

'ఎందుకైనా మంచిది; మా మూటలూ జేబులూ సోదాచెయ్యి.' అన్నారు వర్తకులంతా.

'మీ ఎవరిమీదా నాకు అను మానం లేదు.' అన్నాడు లాలు

'అదేమన్న మాట?' అంటూ వాళ్లు ఒక్కొక్కరే తమ మూట లను విప్పి చూపించారు. జేబులు తలక్రిందు చేసి, 'చూడు.' అన్నారు.

పచ్చ కనపడలేదు. వారిలో ఒక వృద్ధుడు, 'సర్వాణసింగు ఇంకా రాలేదే?' అన్నాడు.

'అతడు చాలా యోగ్యుడు! అతణ్ణి అనుమానించరాదు.' అన్నాడు లాలు.

"ఐతే ఢిల్లీలోనే నీకు మోసం జరిగిఉండవచ్చు. వెళ్లి వాకబు చెయ్యి." అన్నాడు వృద్ధుడు.

మణిలాలు బరువెక్కిన గుం డెతో ఢిల్లీ దారిపట్టేడు. 'నేటితో నా పరువు మంట గలిసింది! నన్ను నమ్మి ఇంతసొమ్ము నాపరంచేసిన ఆంధ్ర చక్రవర్తికి నేనేం సమా ధానం చెప్పగలను?' అనుకుంటూ ఆతడు తన గుఱ్ఱాన్ని మెల్లిగా పోనిచ్చాడు.

కొంత సేపటికి అంతకుముందు రోజున తాను అందరితోనూ ఎక్కి వచ్చిన పర్వతం మళ్లీ ఎదురైంది. ఆ కొండ చాలా ఏటవాలుగా ఉంది. గుఱ్ఱంకాలు ఏమాత్రం జారినా ప్రమాదమని, లాలు జాగ్ర త్తగా కళ్లేన్ని బిగబట్టి గుఱ్ఱాన్ని నడిపించాడు.

ఆతడు కొండదిగువకు చేరు కునేసరికి అక్కడ బోరగిలా స్మృతి తప్పి పడిఉన్న సర్వాణసింగు కన పడ్డాడు.

"కొండ దిగుతూవున్నప్పుడు గుఱ్ఱంకాలు జారి పడిపోయాడు. పాపం!" అనుకుంటూ లాలు తన వద్దనున్న మంచినీళ్లను సింగు గొంతుకలో పోశాడు. సింగు గుటక వేశాడుకాని, వానికి స్పృహ రాలేదు. సింగు గుఱ్ఱంకోసం లాలు నలువంకలా చూశాడుకాని అది ఎక్కడా కనపడలేదు. సింగు మొహంమీద వంటినిండానూ ఉన్న గాయాలను చూసి, 'వైద్యు నికి చూపించి తగిన చికిత్స చేయిం చకపోతే, వీడి ప్రాణాలు నిలువవు.' అని తోచి, సింగును తన గుఱ్ఱం మీద ఎక్కించి సమీప గ్రామా నికి చేర్చాలని నిశ్చయించు కున్నాడు.

పడిఉన్న సింగుకు ఒక అడుగు దూరంలో వాని తలపాగా సగం ఊడిపోయి ఉంది. లాలు దాన్ని తీయబోతోంటే అందులోంచి చిన్నపొట్లాం ఒకటి క్రింద పడింది.

ఆ పొట్లాన్ని విప్పి చూసేసరికి అందులో లాలుకు తన పచ్చ ప్రత్యక్షమైంది!

ఆ క్షణంలో లాలుకు సర్వాణ సింగుపై వచ్చిన కోపం అంతా ఇంతా కాదు. 'ఈ మిత్రద్రోహి నేనా, నేను రక్షిద్దామనుకుం టూంట!' అని ఆతడు తన్ను తానే చీదరించుకున్నాడు.

లాలు ఒక్క క్షణం కూడా అక్కడ నిలబడలేదు. పచ్చను

# విజ్ఞానవీధులు

"డాక్టర్"

## 193. గ్రహక్రాంతి అంటే....?

గ్రహాలలో సూర్యునకును భూమికిని నడుమనున్న బుధ, శుక్రగ్రహాలను, రెండింటినీ అంతర్గ్రహాలను (*Inferior Planets*) పేరుతో పిలుస్తారు. చంద్రునివలెనే అంతర్గ్రహాలుకూడా సూర్యగ్రహణాలను కలుగజేస్తాయి. కాని అంతర్గ్రహాలు కలుగజేసే గ్రహణాలను గ్రహణాలను పేరుతోగాక గ్రహక్రాంతులు (*Transits*) అను ప్రత్యేకనామముతో వ్యవహరిస్తారు. గ్రహక్రాంతి సమయంలో గ్రహము సూర్యబింబముపై నల్లని గుండ్రని మచ్చవలె గోచరిస్తుంది.




1 వ చిత్రంలో సూ - సూర్యుని, లోపలి దీర్ఘవృత్తము అంతర్గ్రహ కక్ష్యను, వెలుపలి దీర్ఘవృత్తము భూకక్ష్యను సూచిస్తున్నా యనుకొందాం. అంతర్గ్రహము తన కక్ష్యలో సంచరిస్తూ ఒక్కొక్కపుడు భూసూర్యులకు సరిగా నడిమికి వస్తుంది. ఆ సమయంలో అంతర్గ్రహ, భూగ్రహ స్థానాలను బు$_1$, భూ$_1$ అను బిందువులు సూచిస్తున్నా యనుకొందాం. ఇట్లు బు$_1$ నందువలె సూర్యునకును భూమికిని నడుమగా అంతర్గ్రహము వచ్చుట తటస్థపడిన యెడల అది న్యూనయోగమును పొందినదని అంటారు.

అంతర్గ్రహము ప్రతి న్యూనయోగ సమయమునను భూసూర్యుల నడుమకు వచ్చును కదా! భూ కక్ష్యాతలమును, అంతర్గ్రహ కక్ష్యాతలమును ఏకతలమున లేవు; అవి ఒకదాని కొకటి కొంచెము ఏటవాలుగ నున్నవి. ఆకాశములో ఈ రెండు తలములు ఖండించుకొనునట్టి బిందువులను పాతములని (*Nodes*) పేర్కొంటారు. న్యూనయోగ సమయంలో ఏదైనా నొక పాతమువద్దగాని, దానికి సమీపముననగాని అంతర్గ్రహముండుట సంభవించినయెడల, ఆ సమయంలో సూర్యుడు, అంతర్గ్రహము భూమియును కూడ ఏకదిశలో ఉంటాయి కాబట్టి సూర్యునికి అడ్డుగా అప్పుడు అంతర్గ్రహము ఉంటుంది. అంతర్గ్రహము యొక్క దృశ్యవ్యాసము (*Apparent Diameter*) సూర్యబింబ దృశ్యవ్యాసమంత యుండి యున్నయెడల అప్పుడు భూవాసులకు సూర్యుడు కనపడకుండ ఆ అంతర్గ్రహము మరుగు పరచగలిగి యుండెడిది. కాని అంతర్గ్రహముల దృశ్యవ్యాసములు చాల తక్కువ. అందుచే నా సమయములో నవి క్రాంతిమంతమైన సూర్యబింబముపై ప్రయాణము చేస్తున్న నల్లని మచ్చలవలె భూవాసులకు కనిపిస్తాయి.

భూ, బుధగ్రహ కక్ష్యాతలాలు పరస్పరము ఖండించుకొను బిందువులను కలుపునట్టి రేఖను మే 7, నవంబరు 9 తేదులల ప్రాంతంలోనే భూమి దాటును కాబట్టి ఆ సమయంలోనే గాని బుధగ్రహ క్రాంతులు సంభవించవు. 1953 వ సంవత్సరము నవంబరు 14 వ తేదీని బుధగ్రహ క్రాంతి కలిగినది; మరల 1957 వ సంవత్సరము మే 6 వ తేదీని భవిష్యత్కాలంలో అది సంభవించనున్నది.

శుక్రగ్రహ క్రాంతులు జూన్ 7, డిసెంబరు 9 తేదీల ప్రాంతములో సంభవిస్తాయి. కాని బుధగ్రహ న్యూనయోగము లంత తరచుగా శుక్రగ్రహ న్యూనయోగములు కలుగవు కాబట్టి బుధగ్రహ క్రాంతు లంత విరివిగా శుక్రగ్రహ క్రాంతులు సంభవించవు. గతంలో 1882 వ సంవత్సరమున శుక్రగ్రహ క్రాంతి సంభవించింది; మరల 2004 వ సంవత్సరము జూన్ 8 వ తేదీని అది కలుగనై యున్నది.

'అనంత్.' ★



"అనార్కలి" లో అంజలీదేవి



"అమర సందేశం" లో ఒకదృశ్యం

# "జాతకఫలం"

ఆర్. ఎస్. ఆర్. పిక్చర్స్‌వారి "జాతక ఫలం" ఈ నెల 1 వ తేదీన విడుదలయింది. ఆర్. నాగేంద్రరావు గారు డైరక్టు చేసిన ఈ చిత్రంలో ఆయనా ఎస్. వి. రంగారావూ, సూర్యకళ, చలం, ఋష్యేంద్రమణి, చంద్రకుమారి, సూర్యకాంతం, జోగారావు మున్నగువారు నటించారు. మాటలు, పాటలు వ్రోలేటి వ్రాశారు.

చిన్నతనంలో స్నేహితులైన నాగేంద్రరావూ, రంగారావూ పెద్దయివాక తలవని తలంపుగా ఒకచోట కలుసుకుంటారు. నాగేంద్రరావు కుమార్తెలక్ష్మి (సూర్యకళ). లక్ష్మిని తన తమ్ముడికిచ్చి పెళ్లి చెయ్యాలని నాగేంద్రరావు భార్య పోరుపెడుతూంటుంది. రంగారావు కొడుకైన సూర్యానికి (చలం) తన అన్న కూతుర్నిచ్చి పెళ్లి చేయాలని భార్య, (ఋష్యేంద్రమణి) తన కూతుర్నిచ్చి పెళ్లిచేయాలని చెల్లెలు (సూర్యకాంతం) వేధిస్తూ ఉంటారు. ఈ సంబంధాలు తమకు నచ్చనందున మిత్రులిద్దరూ తామే వియ్యం పొందాలని నిశ్చయించుకుంటారు. ఈ సంబంధాల్ని తప్పించడానికి గాను, తామే జ్యోతిష్కుల వేషాలు వేసుకుని, జాతకాలు కలవలేదు గనుక సంబంధాలు పనికిరావని జోస్యాలు చెప్పి అందర్నీ నమ్మిస్తారు. ఆపైన సూర్యం, లక్ష్మి జాతకాలు బాగా పరిపోయాయని చెప్పి వారిద్దరికీ వివాహం చేసేస్తారు. సూర్యం, లక్ష్మి సుఖంగా ఉంటారు. కాని లక్ష్మి మీద ఆశపెట్టుకొన్న నాగేంద్రరావు బావమరది కామేశ్వరరావు (జోగారావు) తన ఆశలకు అడ్డం వచ్చిన సూర్యాన్ని హత్య చేయడానికి ప్రయత్నిస్తాడు. అడ్డంవచ్చిన లక్ష్మిని గాయపరుస్తాడు. ఈలోగా పోలీసులువచ్చి అతన్ని బంధిస్తారు. గాయపడిన లక్ష్మి తనకు పెళ్లయిన మూడు నెలలలోగా చావున్నదని జ్యోతిష్కుడు చెప్పిన మాటలను వినడం తటస్థించి, అంతా తన్ను మోసం చేశారనుకుని దిగులుపడుతుంది. చివరకు ఈ జాతకాలన్నీ చెప్పింది నిజమైన జ్యోతిష్కులు కాదనీ, నాగేంద్రరావూ, రంగారావు కలసి ఆడిన నాటకమేననీ తెలుస్తుంది. కథ సుఖాంతంగా ముగిసిపోతుంది.

ఈ చిత్రంలో కథ చాలా చిన్నది. అయినా మామూలు నిడివికి తగ్గకుండా ఉండేందుకుగాను కథ పెంచారు. కనీసం రెండుసార్లు చిత్రం అయిపోయిందని పిస్తుందిగాని మళ్లీ మరొక మలుపుతిరిగి కథ ప్రారంభమవుతుంది. సూర్యానికి లక్ష్మికి పెళ్లయిన తర్వాత, లక్ష్మి అదివరకు దాసీపిల్లవలె నటించి తన్ను మోసం చేసిందని సూర్యానికి కోపం రావడం, వారి ప్రణయ



యూనియన్ పిక్చర్స్ వారి "శ్రీజగన్నాధ మాహాత్మ్యం" లో నర్తకి "రోజ్."

## "జాతక ఫలం"

కలహం చల్లారిన తరవాత కామేశ్వరరావు వారిమీద పగసాధించదలచి విఫలుడు కావడం, ఆ తర్వాత తన చావు సమీపిస్తోందని లక్ష్మి దిగులుపడి ఆమె జబ్బు ఎక్కువ కావడం ఇవన్నీ కథను పెంచడానికి తోడ్పడ్డాయి.

అయినా ఈ చిత్రం ప్రేక్షకులకు వినోదం కలిగించడంలో కృతకృత్యమైందనే చెప్పాలి. సన్నివేశాల్లోనూ, సంభాషణల్లోనూ, కావలసినంత హాస్యం ఉన్నది. రంగారావూ, నాగేంద్రరావూ ఈ సన్నివేశాలకు జీవంపోశారు. చిత్రమంతటా ఉన్న హాస్యం మూలంగా ఎక్కడా విసుగు కలగనీయని చక్కని కాలక్షేపం ప్రేక్షకులకు లభ్యమవుతుంది. తోలేటివారి సంభాషణల రచన చక్కగా ఉంది. ఫొటోగ్రఫీ మొదలైన టెక్నికల్ విలువల విషయంలోకూడా ఈ చిత్రం ఏవి. ఎమ్. వారి చిత్రాల స్థాయిలోనే ఉన్నది. ★

## "ఇద్దరు పెళ్లాలు"

నాగూర్ సినీ ప్రొడక్షన్స్‌వారు తీసిన "ఇద్దరు పెళ్లాలు" తెలుగు చిత్రం ఇటీవల విడుదలయింది. ఎఫ్. నాగూర్ డైరెక్టు చేశారు. మాటలు, పాటలు కోపల్లె వెంకటరమణా రావు వ్రాశారు. సి. ఎస్. ఆర్., రాజమ్మ, లక్ష్మీకాంత, జమున, ఎన్. టి. రామారావు, శివరావు మున్నగువారు నటించారు.

పిల్లలులేని ఒకజమీందారు (సి.ఎస్.ఆర్.)ను అతని భార్య రాధ (రాజమ్మ) పిల్లలకోసం రెండో పెళ్లి చేసుకోమని మాటవరసకు అడుగుతుంది. ఆ మాటను సాకుగా తీసుకుని జమీందారు తాను అదివరకే వలచిన పుష్ప (లక్ష్మీకాంత) అనే స్త్రీని పెళ్లి చేసుకుంటాడు. కొంత కాలం సవతులిద్దరూ బాగానే ఉంటారు. కాని పుష్ప ముందుముందు తనగతేమవుతుందో అనే భయంవల్ల జమీందారుకు రాధపై చాడీలు చెప్పి మనసు విరుస్తుంది. కొంతకాలానికి రాధ గర్భవతియై మగశిశువును ప్రసవిస్తుంది. ఆ శిశువు పుట్టగానే పుష్ప ఒక నౌకరుచేత శిశువును చెత్తకుండీలో పడవేయిస్తుంది. శిశువు చనిపోయాడని అందరితోనూ చెబుతుంది. ఆ శిశువును పేదవాడొకడుచూసి తనయింటికి తీసుకుపోయి పెంచుతూ ఉంటాడు. రాధకూ, ఆ పేదవాడికీ వ్యభిచార సంబంధం కల్పించి పుష్ప జమీందారుకు ఆగ్రహం తెప్పిస్తుంది. జమీందారు కళ్లు తెలియని కోపంలో రాధ గొంతుక నులిమివేస్తాడు. ఆమె చనిపోయిందని అంతా అనుకుంటారు గాని, ఆమె తేరుకుని అక్కడా అక్కడా కూలిచేసుకుని పొట్ట పోసుకుంటూ ఉంటుంది. ఇలా చాలా కాలం గడుస్తుంది. జమీందారును తన చేతికీలు బొమ్మగా చేసుకుని పుష్ప అతన్ని ఆడిస్తూ, చివరికతన్ని ఇంట్లోనే బంధించి వుంచి, చాలా హింసలు పెడుతూ ఉంటుంది. మొదటి భార్యకు పుట్టిన కొడుకు మల్లయ్య (ఎన్. టి. రామారావు) అనే పేరుతో పెరిగి పెద్దవాడవుతాడు. అతను కన్నమ్మ (జమున) అనే కూలీపిల్లను ప్రేమిస్తాడు. చివరకు జమీందారు తన రెండవ భార్య చేసిన ద్రోహం, మొదటి భార్య నిర్దోషిత్వం తెలుసుకుని పశ్చాత్తాపపడతాడు. పుష్ప విషంతాగి ఆత్మహత్య

చేసుకుంటుంది. జమీందారు తన మొదటి భార్యకు బాధను, కొడుకు మల్లయ్యను కలుసుకుని క్షమాపణ కోరుతాడు. మల్లయ్య కన్నమ్మను వివాహమాడుతాడు. అంతా సుఖంగా ఉంటారు.

ఈ కథ పాతికేళ్ల కిందట జరిగినట్లు భావించాలని నిర్మాతలు మొదటే తెలియజేశారు. కథేకాకుండా, స్క్రిప్టురచన, దర్శకత్వం, ఛాయాగ్రహణం వగైరాలుకూడా పాతికేళ్ల కిందటి టెక్నిక్‌ను జ్ఞాపకం చేస్తున్నాయి.

## బహుమతులకు అర్హమైన చిత్రాలు

భారతీయ చిత్రాల్లో ఉత్తమమైన వాటిని నిర్ణయించడానికి నియమించబడిన కేంద్ర కమిటీవారు తమ సలహాలను ఇటీవల ప్రకటించారు.

కథాచిత్రాల్లో ఆత్రే పిక్చర్స్‌వారు నిర్మించిన "శ్యాంచీ అయీ" (శ్యాముని తల్లి) అనే మరాఠీ చిత్రాన్ని, రాష్ట్రపతి బహుమతికి అర్హమైనదిగా వారు సూచించారు.

బిమల్ రాయ్ ప్రొడక్షన్స్‌వారి "దోబిఘా జమీన్" (హిందీ) చిత్రానికి, దేవకీ బోస్ ప్రొడక్షన్స్‌వారి "భగవాన్ శ్రీ కృష్ణ చైతన్య" (బెంగాలీ) చిత్రానికి సర్టిఫికెట్స్ ఆఫ్ మెరిట్ ఇవ్వవచ్చునని సూచించారు.

డాక్యుమెంటరీలలో "మహా బలిపురం" అనేదానికి రాష్ట్రపతి బహుమతిని, "హాలోలీ హిమాలయాస్," "త్రీ ఆఫ్ ఇల్త్" అనేవాటికి సర్టిఫికెట్స్ ఆఫ్ మెరిట్ ఇవ్వవచ్చునని సూచించారు. ఈ మూటిని ఫిల్మ్స్ డివిజన్‌వారే తయారుచేశారు.

పిల్లల చిత్రాల్లో భారత ప్రధాని బహుమతికి అర్హమైనదేదీ లేక పోవడంవల్ల, "ఖేలా ఘర్" అనే బెంగాలీ చిత్రానికి సర్టిఫికెట్ ఆఫ్ మెరిట్ ఇవ్వాలని సూచించారు.

పోటీకి వచ్చిన చిత్రాల పరిశీలనకు నియమించబడిన కేంద్ర కమిటీ అధ్యక్షుడు శ్రీ మంగళదాస్ పక్వాసా. సభ్యులు డా॥ కాళిదాస్ నాగ్, ప్రొ॥ రామధారి సిన్హా దినకర్, శ్రీమతి. కమలాదేవి చటోపాధ్యాయ, సి. వి. దేశాయి, ఎస్. వి. అయ్యర్.



ఇటీవల సోవియెట్ యూనియన్ లో పర్యటించిన భారతీయ సాంస్కృతిక ప్రతినిధి వర్గంతో వెళ్ళిన నర్తకి తారాచౌధురి

## రష్యాలో మన ఫిలిం ప్రతినిధులు

### భారతీయ చిత్రాలకు అఖండ స్వాగతం

సెప్టెంబరు 23వ తేదీన మాస్కోలోనూ, మరో 18 పెద్ద సోవియట్ నగరాల్లోనూ భారతీయ చలన చిత్రోత్సవం ప్రారంభమైంది. ఆవారా, దోబిఘాజమీన్ మొదలైన చిత్రాలు ఒక్క మాస్కోలోనే 50 సినిమా మందిరాల్లో ప్రదర్శింపబడ్డాయి. సోవియట్ సాంస్కృతిక మంత్రి జార్జి అలెగ్జాండ్రోవ్ ఉత్సవాన్ని ప్రారంభిస్తూ, ఈ ఉత్సవం ఇండో సోవియట్ స్నేహ సంబంధాలను అభివృద్ధి చేయగలదని అన్నారు. ఆ రోజు పలువురు సోవియట్ ఫిలిం నటీనటులు, డైరెక్టర్లు అనేకులు హాజరయ్యారు.

భారతీయ చిత్రాలకు రష్యన్లు అపూర్వమైన స్వాగతం ఇచ్చారని తెలుస్తోంది. చలన చిత్రోత్సవం అనుకున్న దానికంటె

లక్ష్మి తనను మోసం చేసిందని హంగామా చేస్తున్న సూర్యం.
“జాతకఫలం” లో చలం, సూర్యకళ

“జాతకఫలం” లో కపట జ్యోతిష్కులుగా
రంగారావు, నాగేంద్రరావు.



## రష్యాలో మనఫిలిం ప్రతినిధులు

ఎక్కువగా విజయం పొందినందువల్ల ఉత్సాహాన్ని పొడిగించ దలచామని ప్రతినిధివర్గ కార్యదర్శి ఆర్. ఖన్నా అన్నారు. మాస్కోలో భారతీయ చిత్రాలు ప్రదర్శించబడే 60 సినిమా మందిరాలవద్ద ప్రబ్రహ్మాండమైన జనసమూహాలు టిక్కెట్ల కోసం ‘క్యూ’లలో నిలబడడం కనిపించిందనీ, మొత్తం 70 లక్షల మస్కో వైట్లలోను 10 లక్షలమంది మొదటి వారంరోజుల్లోనూ ఆ చిత్రాలను చూశారని సోవియెట్ పత్రికలు వ్రాశాయి. స్టాలిన్ గ్రాడ్‌లో లక్షమంది చూశారని టాస్ ఏజెన్సీ ప్రకటించింది.

“సోవియెట్ సంస్కృతి అనే పత్రికలో రాజ్ కపూర్ వ్రాస్తూ, 1953 లో అమెరికాకు తాము వెళ్ళడానికి, 1954 లో

దత్తు ధర్మాధికారి నిర్మించిన 'భాగ్యవాన్' చిత్రాన్ని తెలుగులో రంగాగారు 'మా గోపీ'గా నిర్మించారు. సంగీతం నుంచి కథ వరకూ అన్నింటికీ మనవాళ్లు హిందీవాళ్లను అనుసరించడం అలవాటైపోయింది.

ధర్మాధికారి వాస్తవిక దర్శకుడని ఒక ప్రథ ఉంది. కాని 'భాగ్యవాన్' చిత్రంలో అదేమీ కనిపించదు. మన యిళ్లలోనే ఎవరైనా పుట్టుకతోనే తల్లినీ తండ్రినీ పోగొట్టుకోవచ్చు. ఆ పరిస్థితిలో వాడిమీద చికాకు పడనక్కర్లేదు. అంతేగాని వాడి నొక భయంకర పిశాచిగానూ, అంటరానివాడిగానూ ఎంచడం హాస్యాస్పదం, ఆశ్చర్యకరం. ధర్మాధికారి యీలాంటి సంఘటన ఎక్కడ చూసేరో అర్థంకావటంలేదు. హిందీవాళ్లు ఏవిధంగా చిత్రించినా వారినీ వారి చిత్రాలనూ ఆకాశపథాని కెత్తివేయడం అలవాటైపోయిం దీమధ్య.

ఇక తెలుగుచిత్రం విషయం చూస్తే, ఒక సన్నివేశం కేవలం పురాణయుగాన్ని జ్ఞప్తికి తెస్తుంది. చెట్టుకొమ్మకు వూయాల గట్టి పసివాణ్ణి లోపల వుంచి వూపుతారు. ఈ వూపువేగానికి చెట్టు కూకటి వ్రేళ్లతో సహా నేలకూలుతుంది. దాని అడుగున ఒక పాత్రలో ఏనాడో వారి పెద్దలచే దాచబడ్డ బంగారు మొహిరీలు బహిర్గతమౌతాయి. అవి కొందరికి రాళ్లుగాను కొందరికి మొహిరీలుగానూ కనిపిస్తాయి. పసివాని చెయ్యి వాటిమీద పడగానే మొహిరీలుగా మారతాయి. ఇలాటి అసహజ సంఘటనలు చాలా ఉన్నాయి.

గోపీ సైగవల్ల ఆగిన రైలులోనుండి ఒక్క డ్రైవర్ మాత్రమే దిగి తనమాట లప్పచెప్పి వెళ్తాడు. పోనీ గూడ్సుబండేమో అనుకుందామంటే ఎందరో ప్రజలను గోపీ కాపాడినట్లుగా డ్రైవర్ చెప్తాడు. ప్రయాణీకులను చూపించ నవసరం లేదనుకున్నారేమో దర్శకులు?

రామదాసు, కమలమ్మల మేకప్‌లో ముదిమి కనిపించలేదు సరికదా కమలమ్మలో ఆకర్షణ ఎక్కువైంది. పాటలు అంత ఆకర్షణగా లేకపోయినా బాగానే వున్నాయి.

జె. ఎస్. కామేశ్వరరావు—
విజయనగరం.

* * *

దత్తా ధర్మాధికారి నిర్మించిన, "భాగ్యవాన్" ని అనుసరించి (వారు చెప్పకపోయినా) ఈ చిత్రం తీశారు. జపానీసు చిత్రం "యూకీవారిసు" అంతర్జాతీయ ఖ్యాతి నార్జించిన తర్వాత, పిల్లలకు ప్రధానభూమికలు గల పెద్దల చిత్రాలు బాక్సాఫీసు హిట్లు కాగలవని ఒక కొత్త సూత్రం ఏర్పడింది. బూట్‌పాలిష్, వసేమున్నేకంటి చిత్రాల విజయం ఇందు కుదాహరణ. ప్రేమకథలతోటి, పాత నటులతోటి విసుగెత్తిన ప్రేక్షకుల్ని ఇటువంటి చిత్రాలు ఆకర్షిస్తున్నాయి: ముఖ్యంగా, నటనలో, చిన్నపిల్లలు సులభంగా మెప్పుపొందగలరు.

ఇటువంటి మూలసూత్రంపై ఆధారపడి కరుణ రసప్రధానమైన ఈ చిత్రంలోకూడా డైరక్టరు ధైర్యంచేసి పాత ప్రేక్షకాకర్షణ సూత్రాలను వ్యతిరేకించలేకపోయారు. అందుకనే కథ కవసరంలేని అసందర్భపు సంఘటనలూ, సన్నివేశాలూ కేవలం ఆకర్షణకోసం జొప్పించబడ్డాయి. ఇటువంటి వాటిలో కాలేజీలో వినోద నృత్యప్రదర్శనం ఒకటి ఏవగింపు కలిగించేటుంది. కళాశాలల్లో సామూహిక ప్రణయనృత్యం విశోదాన్ని గాని, విజ్ఞానాన్ని గాని ప్రదర్శించక అసభ్యతని సూచిస్తుంది.

అనవసరపు సన్నివేశాలవల్ల కథ, నాయకుడైన గోపీ చుట్టూ తిరగదు. పైగా కథాగమనం మందంగా "అనగనగా ఒక రాజు" అనే ఫక్కీలో వుంది.

ఎన్నిలోపాలున్నా ఈచిత్రం బాగుండటానికి, నటీనటుల సమర్థతతో కూడినపాత్ర నిర్వహణే కారణం. ఇటువంటి చిత్రాలలో వినోదానికి స్థానంలేకపోయినా, ఆ వినోదపు పాత్రను రేలంగి నిపుణతతో నటించడంచేత అంతగా పరవాలేకపోయింది.

సత్యం—కాకినాడ.

* * *

ఈచిత్రం తుక్కీకిముక్కి హిందీ 'భాగ్యవాన్' చిత్రానికి అనుకరణ. పాట్సు, సెట్సు, అనుకరించగలిగారుగాని సెంటిమెంట్సుమాత్రం తేలేకపోయారు. భాగ్యవాన్ చిత్రములోని "కుబ్జవానికి కుక్కతో సంబంధము" గల భాగము ఎందుచేత వదిలివేశారో తెలియదు. కథకు విసుగునిచ్చే ఆపాట్సు వీరి దృష్టికి ముఖ్యముగా తోచకనా? కథకు ఏవిధంగానూ సంబంధంలేని "యువతీయువకుల" డాన్సు ఘట్టం ప్రవేశపెట్టారు. కథాంతంలో వదినగారి యింటి నుంచి బయలుదేరినగోపీ రైలుపట్టాలమీదకు ఎందుకు వస్తాడు? గోపీ ఎటువెళ్ళాడో తెలియని వదినగారూ, అన్నగారూ అకస్మాత్తుగా పట్టాలమీద ఎలా ఊడిపడ్డారు? అర్థరాత్రివేళ ఊరుగానిఊళ్లో, అయిదారు సంవత్సరములు వయసు గల తమ్ముడు తన యింటికివస్తే చదువుకున్నవాడూ, చిన్నప్పుడు ఎంతో ప్రేమించిన అన్నగారు తమ్ముని బయటకు గెంటివేయటం చాలా అసహజంగా ఉంది.

పాండు కొన్నిచోట్ల మోతాదుకు మించివుంది. సంగీతం బాగానేఉంది. డైలాగులు కొవ్వలివారి నవలలోవలె నే బిగువులేకుండా వున్నాయి. డాన్సులు ఘోరం. స్వప్నలోకం సెట్ బాగుంది. ఆటలలో తారచేత 'పట్టాలు తప్పితే రైలు పడిపోయి జనంచచ్చిపోతారని' గోపీకి చెప్పించటం, సుశీల గోపీ ఉత్తరం చదివినతరువాత వీణ వాయించేటప్పుడు వీణమీద గోపి పరుగెత్తినట్లు చూపటం బాగున్నాయి.

నటీనటుల్లో బేబీ అనూరాధ, వరలక్ష్మి చాలాబాగా నటించారు. నాగయ్య, జమున, వెంకటేశ్వర్ బాగానే నటించారు. వెంకటేశ్వర్ డైలాగ్సు పట్టిపట్టి మాట్లాడడంతో పాత్రకు నిండురాలేదు. రేలంగి, నరసింహారావు అంత తృప్తిగా నటించలేకపోయారు.

---

రష్యా వచ్చినదానికీ ఎంతో తేడా ఉన్న దన్నాడు.

"అమెరికన్లు మాతో కరస్పర్శ చేశారు. మమ్మల్ని చాలా ప్రశంసించారు. మా ఫిలిములను తమదేశంలో ప్రదర్శించడాన్ని గూర్చి చర్చించారు. కాని ఇదంతా కేవలం చర్చలుగానే మిగిలిపోయింది. ఉదారమైన ఉపన్యాసాలు, స్నేహభావ ప్రదర్శనలు, సానుభూతి, ఇవన్నీ శుష్కప్రియాలుగానే ఉండిపోయాయి.

అమెరికాలో మా ఫిలిములను ప్రదర్శించకపోవడం మాకు చాలాబాధ కలిగించింది. ఇండియాలో అనేకసినిమామందిరాలు ఏళ్ళతరబడి హాలీవుడ్ ఫిలిములను ప్రదర్శిస్తూ ఉన్నాయి. నిజానికి హాలీవుడ్ ఫిలిములలో అధికభాగం జుగుప్సతప్ప మరేభావమూ కలిగించవు," అని రాజ్ కపూర్ తన వ్యాసంలో వ్రాశాడు.

భారతీయ ఫిలింప్రతినిధులు సోవియెట్ యూనియన్‌లో కాకసస్, ఏషియాటిక్ ప్రాంతాలనుకూడా దర్శిస్తున్నారు.



చేపలకోసం వలలు

—ఫొటో: సి సీతారాం, మద్రాసు.

# మీ ముఖమును మృదువుగ, మనోహరముగ, నవనవలాడేలా ఉంచుకొనుట ఎంతో సులభము!

మీ చర్మమునకు పాండ్స్ సౌందర్య రక్షణ యివ్వండి

ప్రసిద్ధిగాంచిన పాండ్స్ క్రీములు మీ చర్మమునకు అత్యుత్తమమైనవి; మీ పరిసరాల శీతోష్ణస్థితుల బాధలనుండి దానిని కాపాడును. ప్రపంచమంతటా సౌందర్యవతులవలె మీరూ ఈ క్రీముల సౌమ్యరక్షణతో మీ ముఖమును నవవికసిత పుష్పమువలె ఉంచుకొనగలరు.




పొడిగాలిగల శీతోష్ణస్థితి మీ ముఖ కాంతిని పాడుచేస్తే—పాండ్స్ కోల్డ్ క్రీమ్ మీకు అవసరము. దానిలో నున్న విశేష నూనెలు చర్మమునకు ఉపశమనము నిచ్చి తీక్షణమైన ఎండ, వడగాడ్పులతో అది వాడిపోకుండా కాపాడును.




మీ చర్మము సహజముగ జిడ్డుగా యుంటే లేక వేడి చెమ్మగల గాలిలో జిడ్డుగా అవుతూ ఉంటే—పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్ వాడండి. ఎంతో తేలికగా మరియు మంచువలెనున్న ఈ క్రీమ్ రోమరంధ్రాలను అడ్డిన జిగటను, నిర్జీవమైన రక్త కణములను అడ్డము తీసి, మీ ముఖమునకు సౌమ్య రక్షణ నిచ్చును.

## ప్రపంచములో సౌందర్యరాణులు వాడే క్రీములు

పాండ్స్ క్రీములను ప్రతిదినము తప్పక వాడి మీ చర్మములో వ్యత్యాసము చూడండి — కొన్ని రోజులలో మీ ముఖము ఎంతో నిర్మలముగ, మృదువుగ ఉండుట మీరు చూడగలరు—అనుభవించగలరు కూడ!

# పాండ్స

కోల్డ్ క్రీమ్

వానిషింగ్ క్రీమ్




P 9948